

నిరజా నదీతీరంలో శ్రీకృష్ణుడు

హైదరాబాద్ సాలార్‌జంగ్ చిత్రవస్తు ప్రదర్శనాలయంలోని పురాతన వర్ణచిత్రాలలో ఇదొకటి
(మరొకటి వెనుక కవరు లోపైపున చూడండి.)

# ఆంధ్రపత్రిక

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక
4 అణాలు

## ప్రతి బుధవారము
ప్రకటింపబడును

**Founder: K. NAGESWARA RAO**

సంపుటము **44**
సంచిక **22**
**6-2-52**

ఖర సంవత్సర మాఘ శుద్ధ ఏకాదశి బుధవారము


## విషయానుక్రమణిక

## 1952 ఫిబ్రవరి 6



## స్వప్నలోకంలో ఆలిస్

వచ్చేవారం (13-2-52) నుండి సచిత్ర వారపత్రికలో బొమ్మరిల్లు శీర్షిక క్రింద స్వప్నలోకంలో ఆలిస్ అనే బొమ్మలకథ సీరియల్‌గా ప్రచురించబడుతుంది. వాల్ట్‌డిస్నీ నిర్మించిన *Alice In Wonderland* అనే కార్టూన్‌సినిమా తాలూకు బొమ్మలు ఈ సీరియల్‌లో ప్రకటించబడతాయి. —సంపాదకుడు.

# కర్తవ్యం

‘ఏమండీ!’

‘.........’

‘...మిమ్మల్నే.’

పరధ్యానంగా వున్న గోపాలం తలెత్తి చూశాడు.

‘అలా చూస్తారేమిటి? మిమ్మల్నే పిలుస్తూంట.’

‘అంత కొంప మునిగిపోయినట్లు అరవకపోతే, విషయమేదో విడమర్చి చెప్పరాదూ?’

‘ఎన్ని సార్లని చెప్పనూ?’ అని సాగదీసింది, కాంతమ్మ ‘తొమ్మిదయినా మీరు కూర్చున్నచోటినుండి లేవరాయె. తున్నాం గాని పిల్లల్నేం చెయ్యమన్నారు?’

‘నన్నడిగే దేముంది? నువ్వే ఆలోచించి ఏదో ఒకటి చేసెయ్యి.’ మూతి విరుచుకుంటూ, చేతులు తిప్పుకుంటూ వెనక్కు తిరిగింది కాంతం.

వెళ్లిపోతావెందుకూ. పోనీ అబ్బాయిని పంపించు. బియ్యం, కట్టెలూ యింట్లోపడేయించి మరీ బడికి వెళ్లిపోతాడు. నాకు పనుంది, షావుకారింటికి వెళ్లాలి’ అని సమాధానం యిచ్చేడు, గోపాలం కొస్త గంభీరంగా కొస్త బెరుగ్గా.

‘ఆ మాత్రం సలహా మీరు చెప్పలేరని కాదు. డబ్బు పారెయ్యండి, నా మొహాన’

ఎగరేసుకు పోయాడు, యింటి ఖామందు. అదేం ఖర్మమో, డబ్బు లేనప్పుడే దాని అవసరం ఎక్కువ కనిపిస్తూంటుంది. అయిదో తారీక్కి చేతులో దమ్మిడీ లేకపోతే, తక్కిన యిరవై అయిదు రోజులూ, ఏం తినాలి, ఎట్లా గడపాలి? తనలాంటి వాళ్ల బాధల్ని చూసే కాబోలు, ఎవరో అమాత్యశేఖరుడు గడ్డిలో చాలా విటమినులున్నాయని కనిపెట్టి గడ్డి తినడం నేర్చుకోమని సలహా యిచ్చారు. ఆ సలహా యిచ్చిన మహానుభావుడు అతినే దెలాగో స్వయంగా ప్రదర్శించి చూపినా బాగుండిపోను. తనూ, భార్యా, నలుగురు పిల్లలూ వున్న యింట్లో నెల పొడుగునా బియ్యం

## శ్రీ వి.వి. సూర్యనారాయణ

పొయ్యిమీదకూ, పొయ్యిక్రిందకూ కూడా ఏమీ లేవు అలా గోళ్లు గిల్లుకుంటూ కూర్చుంటే యేం తింటారి వేళ? త్వరగా లేచి బియ్యం, కట్టె పుల్లలూ యింటికొచ్చే ఏర్పాటేదన్నా చెయ్యండి.

‘ఏర్పాటేమిటి, యేర్పాటు?... ఎప్పుడూ లేని మాట? మనదేమన్నా తాసిల్దారుద్యోగమనుకుంటున్నావేంటి, ఏర్పాట్లు చెయ్యడానికీ, సప్లయిలు కావడానికీను. ఎవడికైనా సప్లయిలు మనం చెయ్యవలసిందేకాని మన కెవడు చేస్తాడే?

‘ఆఁ! చేస్తారు, చేస్తారు. మన మొహానికి సప్లయిలు కూడాను. మీరు గోడకొట్టిన మేకు లాగా అలాగే కదలకుండా కూర్చుంటే యివాళ పొయ్యి మీద గిన్నెక్కినట్లే. మీరూ నేనూ వస్తుంటే

అని పూర్తిగా గంభీరంగా సమాధానం వచ్చింది పెరట్లోకి వెళ్లిపోతూన్న భార్య దగ్గరనుండి.

భార్య డబ్బు మాట జ్ఞాపకం చేసేసరికి గోపాలానికి పచ్చి వెలక్కాయ గొంతులో యిరుక్కున్నట్లయింది. ప్రస్తుతావసరానికి అధమం అయిదు రూపాలయినా కావాలి. ఇప్పుడతని దగ్గర అయిదు రూపాయలు కావు గదా అయిదు దమ్మిడీలయినా లేవు. సరుకులు కావాలంటే ఎలా వస్తాయి? ఇప్పటికే కిరాణా దుకాణం మీదా, కట్టెల అడితిలోనూ తన తలకు మించిన అప్పులు పెరిగి కూర్చున్నాయి. వాళ్ల ధర్మమా అని లేవన్ బియ్యం షాపులో యింకా అరువు యివ్వడం లేదు. ఇచ్చేమాటయితే అక్కడా ఏభై రూపాయలకు తక్కువ గాకుండా అతని ఎకౌంటు పెరిగివుండేది. షావుకారు దగ్గర చేసిన చేబదుళ్ల మీద వడ్డీతో సహా పాతిక రూపాయలూ మినహాయించుకుని, అయిదు రూపాయలు మాత్రమే ఆ నెల జీతంక్రింద ముట్టచెప్పేడు, షావుకారు. ఇంటద్దె క్రింద ఆ అయిదు రూపాయల్నీ ఒకటో తారీఖునే

కావాలంటే నిజంగా కష్టమే. గడ్డిఅయితే ఏ వీధులోనో పడి కోసుకొని రావచ్చు, అందరికీ సరిపడ—ఏమో, అప్పుడు దానికీ గిరాకీ తగుల్తుందేమో!—గోపాలానికి మనసు స్వాధీనంలో లేక ఊహాలు పెడదారి పడుతున్నాయి.

పెరట్లో స్నానం చేసి యింట్లోకి వస్తూన్న కాంతానికి గోపాలం యింకా బయలుదేరకుండా సావిట్లోనే కూర్చొని వుండడం కనిపించింది. ఆమె నరాసరి గోపాలం దగ్గర కొచ్చింది, విసురుగా.

‘నే నింతసేపట్నుంచీ పోరుతూవుంటే మీరింకా కదల్లేదూ? బాగానే వుంది, వరస. ఈవాళేం తినమంటారో చెప్పండి.’ అంది ఉప్పెన వచ్చినట్లు.

‘గడ్డి’

‘అవునవును. మన ప్రయోజకత్వానికి గడ్డి కాకపోతే అన్నం తింటామేమిటి? వెటకారానికైనా ఓదరీ, దాపూ వుండాలి.’ కాంతం మొహం చిట్లించుకుంటూ లోపలికెళ్లిపోయింది.

ఊహా ప్రపంచంలోంచి అప్పటికి పూర్తిగా తేరుకున్న గోపాలం తను ఏమరు

పాటుగా అన్న మాటలకి నాలుక కొరుక్కున్నాడు. చివాలున లేచి నిల్చున్నాడు. వంకెనున్న చింకిచొక్కా అతని వంటిమీద కెక్కింది. చొక్కాకున్న చిరుగులు కనబడకుండా ఉత్తరీయం అభయహస్తం చూపింది. గోపాలం వీధిలోకి బయలుదేరాడు, శక్తి తీసిన నీరుడిలాగా.

కాంతమ్మ సంచీ తీసుకొచ్చి భర్తచేతికిస్తూ, 'చంటాడికింకా జ్వరం తగ్గలేదు. వచ్చేటప్పుడు దార్లో డాక్టరుగారింటికి కూడా వెళ్లిరండి' అంది

'ఊఁ ?'

'ఏంచేస్తాం? పిల్లాడికి మందు వేయించుకోడం మానకుంటా వేమిటి? ఎలాగో అలా చూడండి.'

'అలాగే.' అన్నాడు గోపాలం. చూడకపోతే ఎలాగా అనుకుని.

గోపాలం ఖాళీసంచి పుచ్చుకొని బయలుదేరాడే కాని, అది నింపుకుని రావడ మెలాగో అతని ఆలోచన కందడంలేదు. అతని మస్తిష్కంలో మామూల జీవిత సమస్యలన్నీ చెలరేగి కదను త్రొక్కుతున్నాయి.

తన్ను తాను పోషించుకో లేక సతమత మవుతూంటే తనకో నలుగురు పిల్లలా? పిల్లలు కావాలని ఎలుగెత్తి గోలపెట్టే తన షావుకారు వంటి శ్రీమంతుల యింట్లో ముచ్చటకైనా ఒక పిల్ల పుట్టదేం? కాని, తనవంటి దమ్మిడీకి మారని దరిద్రునికి యింటినిండా పిల్లలే. ఏమిటో భగవంతుని వింత మనస్తత్వం?! పిల్లలు పుట్టకుండా వుండడాని కేదైనా ఉపాయం దొరుకుతే ఎంత బాగుండును. తన విషయం అలాగ వుంచినా, యీ సమస్య దేశం మొత్తం మీద వ్యాపించివుంది గనక ఎవడో ఒకడు తెల్చుకుంటే పరిష్కారమయేది కాదు. గర్భనిరోధాన్ని ప్రజలచేత అమలులో పెట్టించగలిగే, దేశ సమ్మతించి అందుకు గట్టిగా ప్రయత్నించేసే మార్పు ప్రభుత్వంలో రావాలి. అంతవరకూ హిందూదేశంలో ప్రళయతాండవం చేస్తున్న కరువూ దారిద్ర్యాలకు అంతు వుండదేమో! స్వరాజ్యం అంటూ ఒకటి వచ్చింది గనక ఆ మార్పుకూడా ఎప్పుడో ఒకప్పుడు ఆసన్న మవుతుందని మనం ఆశించడానికి అవకాశముంది. అంతవరకూ దినదినమూ పెరిగే జనాభాకు ఆకలి చల్లారడం కష్టం.

మనసులో మెదుల్తున్న ఆలోచనలింకా ఒకదరికి చేరకుండానే గోపాలం కాళ్ళన్నీ షావుకారింటిదరికి చేర్చి నిలబెట్టేయి. అప్పుడే స్నానం చేసి, రెండోసారి ఫలాహారం తీసుకుని జమాఖర్చుల పుస్తకంతో యినప్పెట్టె ప్రక్కన కూర్చున్నాడు, షావుకారు. షావుకారు అటు తిరిగి కూర్చోడంవల్ల ద్వారబంధానికి ఆనుకుని నిల్చున్న గోపాలం అతనికి కనబడలేదు. వెనక్కి తిరుగుతాడేమో, నమస్కార బాణం ప్రయోగించి, తరువాత తనొచ్చిన పని వెల్లడిచేద్దామని కాచు కూర్చున్నాడు, గోపాలం. కాని షావుకారు జమాఖర్చులు సరిపెట్టుకోవడంలో పడి అరగంటయినా వెనక్కి తిరగలేదు. ఇంక లాభం లేదనుకున్న గోపాలం కాళ్లు ధట్టించి, నిటారుగా నిలబడి, గొంతు సవరించుకొని, చేతులు జోడించి, 'నమస్కారం, బాబుగారూ!' అన్నాడు.

షావుకారు గిరుక్కున వెనక్కి తిరిగి, 'ఏం పంతులూ యిలా వచ్చేవ్! ఇంకా దుకాణానికి పోలేదూ?' అన్నాడు.

'చిత్తం, చిత్తం. ఆదారే ఇలా వచ్చేనండి, కాస్త పనుంది.'



కూర్చోమన్నట్లు సంజ్ఞ చేశాడు, షావుకారు.

'ఫరవాలేదండి.' అంటూనే చతికిల పడ్డాడు, గోపాలం. 'ఈ నెల జీతం క్రింద యిచ్చిన అయిదు రూపాయలూ యింటద్దెకే సరిపోయాయండి. ..' తన గోడు పూర్తిగా చెప్పడాని కుపక్రమించాడు, గోపాలం.

'బాకీ పాతికరూపాయలూ పోను, నీకు రావలసింది అయిదే కాదయ్యా, పంతులూ!'

'అబ్బే, ఎంతమాట! నాకు రావలసిందంతే నండి. ఆ డబ్బు అప్పుడే అయిపోయిందండి. ప్రస్తుతం యింట్లోకి బియ్యం లేవు, కట్టెపుల్లలు లేవు. పైగా మా చంటాడికి వళ్లు తెలియకుండా జ్వరం వస్తూందండీ. చేతులో ఎర్రని యేగాని లేదు......'

'అయితే ఏం చేస్తానంటావు పంతులూ, డాక్టరుగారికి చూపించలేకపోయావా, కుర్రాణ్ణి.'

'అదే మనవి చేసుకుంటున్నానండీ. ఏదో నా పేర ఖర్చురాసి......'

'లాభం లేదయ్యా, నువ్వు తీర్చలేవు. తరువాత నిన్నని యేం లాభం చెప్పు?'

'మీరే అట్లా అంటే నేనేం చెయ్యగలనండీ. ఏదో మీ దగ్గర చాకిరీ చేసుకునైనా అప్పు తీర్చుకుంటాను కాని మానేస్తానా? పెద్ద మనుషులతో వ్యవహారమని నాకు తెలియదూ? జ్వరంలో వున్న మా చంటాడి మొహం చూసనాన్న యిప్పించాలి.'

షావుకారు పిల్లల్లేనివాడైనా, అతనికి పిల్లలంటే అభిమానం ఎక్కువ. పిల్లవాడికి జ్వరం వస్తూందని విన్నాక డబ్బు యివ్వనని అనలేకపోయాడు. 'సరేలేవయ్యా! ఖర్చు రాసుకుని సంతకం పెట్టి యీ పది రూపాయలూ తీసుకెళ్లు.' అని పది రూపాయల కాగితాన్ని గోపాలం ముందు విసిరేశాడు, షావుకారు.

యజమాని ఆనాడింత సుళువుగా లొంగినందుకు లోలోపల సంతోషిస్తూ, డబ్బును జాగ్రత్తగా జేబులో పెట్టి, మళ్లా నమస్కారం చేసి యజమాని శలవు తీసికొని మళ్లా గుమ్మం దాటేడు, గోపాలం.

గోపాలం కావలసిన సరుకులు తీసికొని డాక్టరుకు మాట చెప్పి యింటి కెళ్లేసరికి పన్నెండయింది. గుమ్మంలో కాలు పెట్టేడో లేదో, 'నాన్నా, నాన్నా! జీతం కట్టలేదని బళ్లో నా పేరు తీసేశారు.' అన్నాడు గోపాలం పెద్ద కొడుకు దిక్కు మొహం వేసుకొని ఎదురుగా వచ్చి. ఆ ప్రక్కనే వున్న కూతురు ఎదురుగా వచ్చి అడిగింది, నాకు పరికిణీలు కుట్టించాలి నాన్నా. చూశావా ఎలా చిరిగిపోయిందో గట్టిగా ఉన్న పరికిణీ ఒక్కటే నాకేదు నాన్నా!'

'పెరుగు మనిషికి డబ్బివ్వాలండీ. మీరు అలా వెళ్లగానే అవొచ్చి అడిగి వెళ్లిపోయింది.' అని లోపల్నించే కేకేసింది, కాంతమ్మ.

ఈ హెచ్చరికలు గోపాలం రోజూ వింటూన్నవే. ఈ నాడింతా వినిపించుకున్నాడో లేదో తెలియదు కాని, చేతులో సంచిని మూలగా పెట్టి కట్టెలు మోసుకొచ్చిన కూలీ చేతులో కూలి డబ్బులు పడేసి, విసుగ్గా మళ్లా వీధిలోకి వెళ్లిపోయాడు. దిన దిన గండం వెయ్యేళ్లాయుష్షుగా వుందతని జీవితయాత్ర. సంసారం అన్న తరువాత ప్రతి రోజూ ఏదో ఒక ఖర్చుంటూనే వుంటుంది. కాని ఏరోజుకారోజే తన జేబు ఖాళీగా వుంటూంది. సంసారసాగరాన్ని యీదడాని కతని కేమీ పాలుపోవడం లేదు. ఈ సమస్య అతనికి పదేళ్లనించీ ఉంటూన్నదే అయినా రోజులు గడుస్తూన్నకొద్దీ విషమరూపం దాల్చుతూన్నట్లు కనిపించింది. ఆలోచించినకొద్దీ మనసు పాడుచేసుకోవడం తప్ప ప్రయోజనకారియైన పనిని దేనినీ చేయలేకపోతున్నాడు.

మధ్యాహ్నమంతా దుకాణంలో కూర్చొని తన పని చేసుకుంటున్నాడే కాని అతని మనస్సు జీవిత సమస్యల్ని పరిష్కరించుకొనే మార్గాలకోసం అన్వేషిస్తూంది. సాయంత్రం అయిదయేసరికి పుస్తకాలు మూసేసి నీరసంగా లేచి నిల్చున్నాడు. మధ్యాహ్నం భోజనం లేకపోవడంచేత కడుపులో వకవకలాడుతూంది. ఇంటి వైపు బయలుదేరాడు. కాని అతనిలోని యేవో అజ్ఞాత శక్తు లతన్ని వెనక్కు లాగడం మొదలుపెట్టేయి. ఇంటికి వెళ్లినదగ్గర నుండీ తనను ఎవరు పలకరించినా డబ్బు ప్రమేయంతోనే మాట్లాడుతారు. తనదగ్గర డబ్బు లేదని తెలిసుండీ కూడా. అంచేత అప్పటికి గోపాలం యింటికి వెళ్లే ఉద్దేశాన్ని ఉపసంహరించుకున్నాడు, కడుపులో వకవకలాడుతూండడం వల్ల ఎదురుగా వున్న కాఫీ హోటల్లోకి వెళ్లి ప్రొద్దుటి పదిరూపాయల్లో మిగిలిన చిల్లర డబ్బుల్తో కాస్త కాఫీ కొట్లో పోసుకుని బయటపడ్డాడు. ఏదైనా కాస్సేపు చదువుకుంటే మనశ్శాంతి కలుగుతుందేమోనని అక్కడినుండి లైబ్రరీకి బయలుదేరాడు. లైబ్రరీలో కూర్చొని చదవడానికి పేపరు తీశాడు. కాని మనస్థిమితం లేకపోవడంవల్ల చదవడానికీ మనసు కుదరడం లేదు. నిస్పృహగా ఏదో ఆలోచిస్తూ

దిన పత్రికల్లో అక్కడక్కడ నాలుగేసి వాక్యాలు చదువుతున్నాడు.

'గుంటూరులో ఒక స్త్రీకి ఒకే కాన్పుకు నలుగురు పిల్లలు పుట్టేరు. ఈ వింత చూడ్డానికి జనం తండోపతండాలుగా విరగబడుతున్నారు ...తల్లీ పిల్లలూ ఆరోగ్యంగానే వున్నారు.' —ఈవార్త చదివి 'ఛీ' అనుకున్నాడు గోపాలం. వెంటనే పేజీ త్రిప్పేశాడు. రెండో పేజీలో యింకో వార్త— 'నంద్యాలలో ఒక ఆసామి భార్యనూ నలుగురు పిల్లల్ని పోషించలేక ఒక కొడుకుని అమ్ముకున్నట్లు తెలుస్తూంది..' 'ముందెవడు కనమన్నాడు, యిప్పుడెవడమ్ముకోమన్నాడు? మొదటే జాగ్రత్తపడి కనకుండా వుంటే ఏం పోయిందో!' అనుకున్నాడు, గోపాలం వెంటనే తన విషయం జ్ఞాపకమొచ్చి, తను ఆ ఆసామికి ఏమాత్రం తీసిపోనన్న సంగతి అవగాహనైంది. దినపత్రికను విరక్తితో విసిరేశాడు

గోపాలానికి దేశంలో ఏమూల చూసినా దరిద్రమూ దౌర్భాగ్యమూ ప్రత్యక్షమవుతున్నాయి దానికి తోడు మూలిగే నక్కమీద తాటిపండు పడ్డట్లు, దరిద్రునికే కుచేల సంతానం! అతనికి హటాత్తుగా ఒక ఆలోచన తట్టింది తను గర్భనిరోధాన్ని ఎందుకు అమలులో పెట్టకూడదూ? ఈ వుద్దేశమైతే బాగానే వుంది కాని, అడ్డమయిన మందులూ వాడితే ఒకదానికొకటవుతుందేమోననే భయం వేసింది పోనీ [illegible] కనుక్కొన్న పద్ధతుల్ని గురించి తెలుసుకున్నందువల్ల నష్టమేమీ లేదుకదా అనుకున్నాడు. వెంటనే లైబ్రరీ గుమాస్తాదగ్గరకెళ్లి గర్భనిరోధాన్ని గురించి ఒక పెద్ద డాక్టరు వ్రాసిన పుస్తకం తెచ్చుకొని కూర్చున్నాడు, చదవడానికి.

గోపాలం లైబ్రరీనుండి యింటికి వచ్చే సరికి రాత్రి తొమ్మిదయింది. అప్పటికి పిల్లలంతా భోంచేసి పడుకున్నారు. తనూ భోంచేసి మంచంమీద వెల్లకిలా పడుకుని సాయంత్రం చదివిన పుస్తకంలోని విషయాల్ని గురించి ఆలోచించడం మొదలుపెట్టేడు.

హిందూదేశంలో గూడు కట్టుకొని వున్న దారిద్ర్యమూ, దుఃఖమూ అనే సమస్యల్ని పరిష్కరించడానికి తెలివంటి వ్యక్తులంతా సంతాన నిరోధక మార్గాలు అవలంబించి తీరాలి. అయితే జనాభాసంఖ్య తగ్గించడానికి ప్రయత్నించినంతమాత్రం చేత మనకి ఒరిగేదేమీ లేదు. ఎందుచేతనంటే మనకు కావలసినది సుఖజీవనాన్ని సాగించగలిగే ఆరోగ్యకరమయిన సంతానం. దేశంలో జనాభా అధికంగా తగ్గిపోయినా ప్రమాదమే! దేశాన్ని సుభిక్షంచేసి సర్వవిధాలా ప్రగతిమార్గాన పురోగమింప జేయగల్గేది ఆ దేశపౌరులే గనుక వాళ్ళ అవసరంకూడా దేశానికి ఎంతయినా వుంది దేశంలో ప్రతివ్యక్తీ తనకి ఎంతమంది పిల్లల్ని పోషించడానికి స్తోమతి వుంటుందో అంతకుమించి పిల్లల్ని కనకూడదు. అట్లాకాకుండా పశుకామానికి లోబడి ముందు గతికానకుండా సంతానాన్ని ఉత్పత్తి చేస్తే, పుట్టే పిల్లలకు బిచ్చమెత్తుకోవడం నేర్పవలసిన పరిస్థితులు ఏర్పడక మానవు ఈ విషయం ఎవడో ఒకడు అనుకుంటే లాభంలేదు. ప్రతి వ్యక్తీ ఎవరిమట్టుకు వారు సంతాననిరోధం యొక్క ప్రాముఖ్యతనూ, ఆవశ్యకతనూ గురించి అందుకనుగుణంగా నడుచుకొన్నప్పుడే యీ సమస్య మంచులా విడిపోయి దేశసౌభాగ్యానికి దారిచూపే మార్గాన్ని నిష్కంటకం చేస్తుంది —ఈ సమస్య దేశంలోని అందరికీ సంబంధించినదే అయినా, ఎంతమంది యీ సిద్ధాంతానికి సుముఖులుగా ఉండగలరో గోపాలానికి అంతు చిక్కలేదు.

గోపాలంయొక్క అంతరంగంలో అంతులేకుండా ఉద్భవిస్తూన్న ఆలోచనా తరంగాలకు భార్యరాక అంతరాయం కలిగించింది.

కాంతం మంచినీళ్లచెంబు మంచం కింద పెట్టి, 'ఇంకా మేలుకునే వున్నారూ?' అంటూ తనూ మేను వాల్చింది.

ఎవరిమాట ఎలాగున్నా, తను మాత్రం సంతాననిరోధానికి ప్రయత్నించడానికే సంకల్పించుకున్నాడు, గోపాలం ఆ విషయం తనొక్కడే అనుకోనేకంటె భార్య చెవిని వెయ్యడం కూడా చాలా అవసరం. అంచేత అదే విషయాన్ని చెప్పడానికి భార్యవైపు తిరిగేడు

'ఇదుగో! అప్పుడే నిద్రేనా?' అన్నాడు, తను చెప్పపోయే ఉపోద్ఘాతానికి నాందీవాక్యంలాగా

'ఏం?' అంది కాంతం, యిటు తిరక్కుండానే.

'ఇటు తిరుగు'

"అబ్బ! పడుకుందుగూ, మాట్లాడక." అంది దుప్పటి కాళ్ళక్రిందినుండి తలక్రింది వరకూ లాక్కొని కప్పుకొంటూ.

'అదికాదే. బర్త్కంట్రోలు...అంటే..' చెప్పడానికి తడబడ్డాడు, గోపాలం.

'వచ్చిందన్నమాట! ఇప్పుడున్న వన్నీ చాలక నేనా ఏమిటి యీకంట్రోలు పెడుతున్నారు?' ముసుగులోంచే వచ్చింది ఎదురుచూడని సమాధానం.

'అబ్బే! అదికాదు. ఇది గవర్నమెంటు పెడుతూన్నది కాదు. ఎవరికి వాళ్లు పెట్టుకోవలసిన కంట్రోలు'

'అంటే?' అంది కాంతం ముసుగు కొద్దిగా తొలగించి.

'అలా అడుగు చెప్తా. చూడు...ఇప్పుడు దేశంలోవున్న ప్రతీవ్యక్తికీ కడుపునిండా తిండిలేదు. వంటినిండా బట్టలేదు. ఎందువల్లనంటావు?'



'ఈ ధరలూ, కరువులూ, కాటకాలూ ఎక్కువై పోతున్నాయి.'

'నువ్వు చెప్పింది, కొంతమట్టుకు రైటే. అంతేకాకుండా, ముఖ్యమయిన కారణమేమిటంటే దేశంలో జనాభా పెరిగిపోతూంది. వాళ్ళకు కావలసిన తిండీ, గుడ్డా ప్రభుత్వం సరఫరా చెయ్యలేకుండా వుంది.'

'బావుందండీ! అన్నీ మీరే చెప్తారే. కంట్రోలు పెట్టడంవల్లే కదా, తిండీగుడ్డా చాలకుండావున్నాయి. ఇంకా యీ బర్తుకంట్రోలు కూడా ఎందుకూ, జనం మాడి చావడానికా?'

'అది కాదు. కంట్రోలువల్ల తిండీ గుడ్డా చాలకపోవడంకాదు. తిండీ, గుడ్డా చాలకపోవడంవల్ల కంట్రోలు పెట్టవలసి వచ్చింది. దానిమాటకేంగాని, బర్తుకంట్రోలంటే పిల్లలు పుట్టకుండా చేసుకోవడమన్నమాట!'

'సరి సరి మీ కేదో పిచ్చెక్కినట్లుంది. అయినా గవర్నమెంటు యిష్టమైతేనే పిల్లలుపుట్టి, లేకపోతే మానేస్తారేమిటి? ఇదేం మిల్లుగుడ్డలకి కంట్రోలు పెట్టడం కాదండోయ్! ఇందుకేనా నిక్షేపంలాంటి నా నిద్రంతా పాడుచేశారు? మాట్లాడకుండా పడుకోండి.'

'నన్ను చెప్పనియ్యకుండా మధ్యమధ్య ప్రశ్న వేస్తే ఎలాగ? దీనికీ గవర్నమెంటుకూ ఏమీ సంబంధంలేదు. ఇది ఎవరిమట్టుకు వాళ్లు అవలంబించవలసిన విధానం మాత్రమే. దేశంలో జనాభా తగ్గితే ఉత్పత్తి అయేసరుకు మనకు సరిపోతుంది. ఒక కుటుంబానికి సంబంధించినంతవరకూ మాట్లాడితే, యజమాని ఆర్జన అతని కుటుంబంలో ఎంత తక్కువమంది వ్యక్తులుంటే అంత సుఖంగా జీవించడానికి సరిపోతుందనుకో. అంటే పుట్టినవాళ్లయినా సుఖంగా బ్రతకవచ్చు. గర్భనిరోధాన్ని అవలంబించడానికిచాలాపద్ధతులున్నాయి. అందులో ఏవిధానం అవలంబించడం మంచిదీ, అనీ? అవన్నీ నీకు చెప్తాను. ఏది మంచి పద్ధతో ఆలోచించి నువ్వే చెప్పు.'

'అర్ధరాత్రివేళ యిదేం గోల బాబూ! ఎందుకండీ యిప్పుడీ గొడవంతాను?'

'అది కాదే! మనం కూడా ఏదో ఓ పద్ధతి ఆలోచించి అవలంబిద్దామని.'

'సరిపోయింది!'

'ఏం?'

'నాకు మూడో నెల.' రెండోవైపు ముఖంత్రిప్పి దుప్పటి మీదికి లాగేసుకుంది, కాంతం.

గోపాలరావు ఎదురుగా గజందూరంలో పిడుగుపడ్డంత గాభరాపడ్డాడు. ఇప్పటికున్న నలుగురితోనే సతమతమవుతూంటే, యింకా అయిదోపిల్లకూడానట! అతనికి భార్యను అమాంతంగా నమిలి మింగేద్దామన్నంతకోపం వచ్చింది. నిజానికి తనే తనభార్య నమిలి మింగెయ్యాలన్న విషయం జ్ఞాపకంవచ్చి కోపం చల్లార్చుకున్నాడు. తను చేయబోయే ప్రయత్నం తనకు తెలియకుండా ముందే విఫలమయినందుకు చాలా బాధపడ్డాడు.

తెల్లవారింది. గోపాలం లేచి మామూలుగా తన పనులన్నీ చేసుకుని దుకాణానికి వెళ్లిపోయాడు. సాయంత్రంవరకూ పనిచేసుకుని, ఆరుగంటలకి అలా పార్కులోకి వెళ్లి కూర్చున్నాడు. తనలోని యేవో ఊహా మేఘాలకి రూపాల్ని కల్పిస్తూ. అల్లంత దూరంలో ఎవరో యువకుడు, ఉపన్యాసం యిస్తున్నాడు. కొంతసేపటికి గోపాలానికి ఉపన్యాసం వినాలని బుద్ధిపుట్టి కాస్త దగ్గరగా వెళ్లి కూర్చున్నాడు. ప్రక్కనున్న వాణ్ణి తట్టి పిలిచి, 'ఎవరండీ?' అనడిగేడు, వేదికపైనున్న ఉపన్యాసకుణ్ణి చూపిస్తూ.

'ఆయనాండీ! ఆయన యీ నియోజకవర్గంనుండి శాసనసభకు పోటీచేస్తున్నాడు.' అని చెప్పి, 'ఇదంతా ఓట్లగొడవలెండి. ఓట్ల గొడవ.' అన్నాడు రహస్యంగా, చెవిలో.

ఉపన్యాసం మామూలుగా సాగిపోతోంది.

"..... క్రిందటి దశాబ్దంలో హిందూదేశంయొక్క జనాభా నూటికి పదిహేను వంతులచొప్పున పెరిగింది. అంటే రమారమీ ముప్ఫయి అయిదు లక్షలమంది ఎక్కువయారన్నమాట! ఇది చాలా పెద్ద పెరుగుదల. దేశంలో జనాభా పెరిగిందంటే ఏమిటి? దుఃఖమూ, దారిద్ర్యమూ, వ్యాధులూ, చావులూ ఎక్కువ కావడానికి అవకాశం కలిగిందన్నమాట! ప్రత్యేకంగా మనదేశంసంగతి చూడండి గర్హ్యమయిన దారిద్ర్యంతో విశేషప్రజానీకం బాధపడుతున్నారంటే దానికి జనాభాలోని పెరుగుదలే కారణమని మీరు సులువుగా గ్రహించగలరు. ప్రపంచంలోని దేశాలన్నిటికంటె ప్రతి విషయంలోనూ హిందూదేశం వెనకపడివుందంటే అందుకు భరతమాత కన్నబిడ్డలను దూషించాలి. ఎందుకని అడగండి. మనం పిల్లల్ని లెక్కలేకుండా కని దేశంమీద విడిచి

(46-వ పేజీ చూడండి)

# మేనరికం

"రాధా, బావ లక్ష్మణ్‌నే పెళ్లి చేసుకుంటాట్ట."

అని అంటూ రాధ తల్లి సుభద్రమ్మ, పెరట్లో మొక్కలికి నీళ్లు పోస్తూన్న కూతురుతో అంది. రాధ మాత్రం ఏమీ చలించలేదు, కనీసం ఈ మాటలు విన్నట్టైనా "ఊ" కొట్టలేదు. సుభద్రమ్మ మాత్రం కంట నీరు పెట్టుకుంటూ పెరటి గుమ్మం మీదే చతికిల పడిపోయింది.

"యిన్నాళ్లు నిన్నే చేసుకుంటాడు అని ఎంతో ఆశ పెట్టుకున్నామే. ఎంతలా మారిపోయారు, తల్లీ, కొడుకూ. ఒక్కసారి పోనీ మనలో ఏమైనా లోపం వుంటే, అయ్యో అని అనుకోవచ్చు. కాని, నీకు బుత్తో, నీళ్లిలా ఇయ్యి, మువ్వొళ్లు ఒకసారి నడవలోకి" అని అంటూ రాధ అందించిన నీళ్లతో మొహం కడుక్కుంటూంటే వెంకమ్మ,

"అయితే అక్కయ్యని చూసేవురా, మన రాధమ్మ పనికిరాదుట, మనకెంత అవమానమూ నలుగురిలో. ఏ వొంక వుందో, మేనరికం చేసుకున్నారు కారని, రేపొద్దున్న మనం యింకే సంబంధమైనా చూస్తే అనుమానపడరూ, ఏం వింటున్నావా ఏమిటా పరధ్యాన్నం, యిదుగో తువాలు" అని రాధ అందించిన తువాలు యిస్తూ అంది.

"ఇదిగో లక్షు చెప్తే మాత్రం వాళ్లకి లేని అభిమానం వస్తుందా, మరి యిన్నాళ్లు ఏమీ

"ఏముంది, ఏం చెయ్యమంటే అదే చేస్తాను. లేతవంకాయలున్నాయి, మెంతి పెట్టి వేయిస్తాను. కొబ్బరికాయ పచ్చడి ఆదియ్య వున్నాదేమో వీధిలో పాలు పితికితే యింత పరమాన్నం చేస్తాను, పిలుస్తారా కొంచెం ఏలక్కాయలు తెప్పించాలి" అని అంటూ సుభద్రమ్మ వంటింటిలోకి వెళ్లిపోయింది.

రామయ్య ఆ వూళ్లో మర్యాదస్థుడైన కుటుంబీకుడు. తండ్రి తాలూకు ఆస్తి ఏదో పదిహేనెకరాల పొలం, స్వంతయిల్లు, పాడీ పంటతో ఏదో ఓ చిన్న పిల్ల జమీందారులాగ, కష్టపడవలసిన అవసరం లేకుండా వెళ్లిపోతూంది. రాధ, ఆయన పెద్ద కూతురు 15 ఏళ్ల వయసులో వున్న

## "చాందిని"

చదువు సంధ్యరాదని యిన్నాళ్లీ తంక తెంచని వాళ్లు, యిప్పుడు యిలా మొదలెడితే, ఏం సాధనం, అని పమిటచెంగుతో కళ్లు వొత్తుకుంటూ తల్లి అంటూన్న మాటలకి రాధ,

"అయితే చిన్నత్తయ్య చెప్పిన మాటలు నిజమే అన్నమాట" యింతకీ పెద్దత్తయ్య ఏమంటూంది అని బాల్చీలో నీళ్లతో మొహం కడుక్కుంటూ అడిగింది.

యింతలో రాధ మామ్మ వెంకమ్మగారు కూడా అక్కడికి వచ్చి,

"ఔరా ఎంత పెద్దలంటే నిర్లక్ష్యం అయిపోయింది. కన్నతల్లిని వన్నె లక్ష్య పెట్టకుండా మాట్లాడుతూందే, చెయ్యనీ ఎంత చేస్తుందో, రత్నంలాటి పిల్లని కాలు తన్నుకుంటూంది" అని ఉపన్యాసం యిస్తోందే లోగా, రాధ తండ్రి రామయ్య అప్పుడే పొలంనుంచి వచ్చి,

"ఏమత్తా, అందరూ పెరట్లోనే అఘోరిస్తున్నారు, వీధి తలుపులు బార్లా వదిలేసి, కుక్క దూరబడగలదు. రాధా, ఆ కంచెం

అనని వాళ్లు యిప్పుడు అక్కర్లేదంటే ఏం చేస్తాం యింతకూ ఆ మునసబు కూతురైతే, బాగా ఇరవై, ముప్ఫై వేల ఆస్తి కలిసొస్తుంది. పైగా మేనమామ లింట్లో వుండి ఆ పిల్ల ఏదో కొంచెం చదువు కూడా చదివిందిట కదూ, అని చుట్టముట్టిస్తూ రామయ్య అన్నాడు.

"అప్పుడే నీకివన్నీ ఎలా తెలిసాయి, అక్కయ్య దగ్గరికి వెళ్లొచ్చావా ఏమిటి?

"లేదు రమణయ్య చెప్పేడు దార్లో"

"అసలు మాటేమిటంటే చదువు లేదని చేసుకోరుట, అని సుభద్రమ్మ బియ్యం చెరుగుతూ వల్లె వేసింది.

"ఆ అన్నట్టు అది కూడా అంది, రమణయ్యకెట్టి మడివేసేందని. దానికి మనం అంటే అంత ఎగతాళి అయిపోయింది, డబ్బున్న పిల్లని చేసుకుంటున్నాను కదా అని. ఏదో పెద్ద కాలం అయిపోయింది, నాలుగక్షింతలు వేసి కళ్లు మూద్దామంటే అదీ లేదు. ఏమే సుభద్రమ్మా రాత్రికి వంట ఏం చేస్తావు"

పిల్ల పచ్చటి శరీరం చక్కటి కళ్లు అంతా పల్లెటూరి పతుంలో లక్ష్మీకళ వొలుకుతూ వుంటుంది. అది పల్లెటూరు అవడంబట్టి అయిదవ తరగతి దాకానే చదువు వుండడం చేత అంతే చదువ కలిగింది. రాధ తరవాత గోపీ, చిట్టి మొగపిల్లలు చిన్నవాళ్లు పదేళ్లవాడు, ఏడేళ్లవాడు.

రామయ్య, అక్క, రత్నమ్మ మొగుడికి పట్నంలో రెవెన్యూ ఇన్స్పెక్టరు పని. కొడుకు కృష్ణమూర్తి ఆ ఏటే బి. ఏ. పాస

యాడు. ఏదో అందగాళ్లలో ఒకడని లెక్క వెయ్యొచ్చు. అంతవరకూ రాధని చేసుకుందామని వుద్దేశంలో వున్న వాళ్లు ఒక్కసారి పెద్ద ఆస్థితో పిల్ల వస్తుందని ఆశతో, రాధని చేసుకోవడానికి యిష్టపడలేదు. రత్నమ్మ, కొడుకు, రామయ్యవూరు ఆ వేళ మధ్యాహ్నం బండిలో రాగనే, సామాన్లు తమ్ముడింటికి పంపించేసి పినతల్లి కూతురైన మంగమ్మగారింట్లో కూచున్నారు పెళ్లికూతురు తాలుకు వాళ్లతో రాయబారాలు జరపడానికి. మంగమ్మ, వెంకమ్మ అక్క కూతురు. రమణయ్య ఒక్కడే ఆవిడికి సంతానం. రమణయ్య పుట్టగానే మొగుడు చచ్చిపోయాడు, మొగుడు తాలూకు కొంత ఆస్థి, పొలం, స్వంతయిలు ఏదో హాయిగానే వెళ్లిపోతూంది కాలం. రమణయ్య ఏదో ఫిఫ్తుఫారం దాకా పట్నంలో వెలగబెట్టి తల్లి ఒంటరిగా వుండలేను, అని పోరు పెట్టడంతోటీ చదువుకు స్వస్థి చెప్పి పల్లెటూరు చేరుకున్నాడు వున్న పొలం పుట్రా చూసుకుందామని. రమణయ్య కూడా కృష్ణారావంత నాజూకుతనం ఫేషన్ లేకపోయినా, మంచి కండలు తిరిగిన శరీరం చామనఛాయ రంగు, ఆకర్షణీయమైన ముఖం, వుంటాయి. మంగమ్మ యిల్లు రామయ్య యింటికి మూడిళ్లే మధ్య వుంటాయి. రామయ్య కూడా, కష్ట సుఖాలకి ఆసరా అవుతూ పెద్ద దిక్కులా మంగమ్మకి సాయపడుతూ వుంటాడు.

చిన్నప్పటినుంచి రాధని కృష్ణుడికే యిస్తారని నిర్ధారణ అవడంబట్టే రాధని యింకే సంబంధాలు అడగడానికి కూడా రాలేదు. కాని ఒక్కసారి అంతా తారుమారు అవడంతోటే రామయ్య కుటుంబంలో ఒక పెద్ద అశాంతి బయలుదేరింది. అయితే వచ్చిన దగ్గరనుండీ, వాళ్లిక్కడికి రానేలేదన్నమాట," అని గంజివార బోస్తూన్న పెళ్లాన్నడిగాడు రామయ్య.



"అబ్బే లేదు, నేను, అత్తయ్య అక్కడికి వెళ్ళేం."

"ఏం, రాధ వెళ్లలేదూ"

"వాళ్లు అడగాలేదు యిది వెళ్లాలేదు. మీరూ వెళ్లండి, ఒకసారి బాగుండదు."

ఇంతలో, వెంకమ్మ యిక్కడికొచ్చి, "ఏంరా వెళ్లాలనిలేదూ దాన్ని చూడ్డానికి."

"ఎందుకూ యిప్పుడెలాగా వస్తారు కదూ, ఏం మేనమామనని వాడేవంన్నా ఒక్కసారి చూడ్డానికి వస్తే అరిగిపోతాడా"

వెంకమ్మ నవ్వుతూ బాగుంది "నువ్వు పెళ్లికొడుకువిట్రా, అలిగి కూర్చోడానికి"

"నాకేం మనస్కరించటంలేదు"

అవునులే ఏవన్నమాట, తనకేం బుద్ధి లేదూ, పిల్లాడున్నచోట, పిల్లున్నచోట, పదిమంది వచ్చుడుగుతారు. ఆలా అని, అయిన సంబంధాలు కాలు తన్నుతావా, ఏం విడ్డూరం?

"అసలు ఈ అడిగేవాళ్ళకేం బుద్ధిలేదూ అంటాను?"

"బాగుంది తెలిసి తెలియకో అడుగుతారనుకో."

"అంతేలే, యింతకూ, ఏమిటో ఆస్థి వచ్చేస్తుంది అని, పోనీ యీ సంగతి పోయిన ఏడాదన్నా చెపితే ఈపాటికి మన పిల్లకి పెళ్ళి చేసేద్దును గా."

"ఆ మొన్నటిదాకా వాళ్ళకి వేరే వుద్దేశాలేమీ లేవు మొన్న, ఆ పెళ్లికూతురు మేనమామే, యింత, అంత యిస్తామని ఆశ పెట్టారుట, దానికి వీళ్లు లొంగిపోయారు. పిల్లని చూసుకొని, ముహూర్తాలు నిశ్చయించుకోడానికి వచ్చారు, అప్పుడే ఈ భోగట్టా విన్నే, నీకు చెప్తే నమ్మవు కావు, యింతలో వీళ్ళే వచ్చారు"

"ఆ పిల్ల చల్లగా వుంటుందికదూ, చిన్నప్పుడెప్పుడో చూశాను."

"నూతిదగ్గరకి వెళ్లుతూన్న సుభద్రమ్మ ఈ మాటలువిని.

"అబ్బే ఏం బాగుండదు, మొన్న కరణంగారింట్లో పేరంటకానికి చూసేను అంది"

"ఆ, పిల్లే బాగుండాలేంటి, డబ్బు బాగుండాలి కాని, మెటిక్ లేవను చదివిందట" అని వెంకయ్యమ్మ అంది.

"పోనీలే పెళ్లికొడుక్కి అమ్మమ్మవికద. బాగ లడ్డూలు బూరెలు తిందువుగాని, అని రామయ్య నవ్వుతూ చెప్పేడు"

"ఆ నవ్వుమాత్రం కావేమిటి, మేనమామవి, నాకేం అఖరలేదు, ఎప్పుడయితే నామాట నిర్లక్ష్యం చేసి, పుట్టినప్పటినుండీ, వాళ్ళిద్దర్నీ ఒకటి చేయాలని అనుకొంటే,



విడదీసుకొని, ఎగిరిపోతూవున్న వాళ్ళ వెనకాల నాకేంపట్టింది తిరగడానికి? నాకేం, నేను పెళ్ళివేళకి గుమ్మడివరం వెళ్ళిపోతా, మా కక్కగారింటికి''



"తీరా దీని కింకెక్కడా సంబంధాలు కాక, ఈవూరు సంబంధమే కుదరాలి, ఖర్మ కాకపోతే, ఏదీ రాధా, యింకా చిట్టాడు, గోపీ రాలేదూ? ఆ బీరువాలో వున్న నూనెసీసా పట్రా" అని తండ్రి కేక వినగానే, రాధ సీసా పట్టుకొచ్చి పెట్టింది.

"ఇన్ని అనుకుంటాంగాని, మరి మా అక్కయ్య ఆడబిడ్డకి, ఎన్నో సంబంధాలు పెద్ద పెద్దవి వచ్చాయి, మరి, ఆవిడ ఎంత యినా, మా అక్కయ్య కూతుర్నే నా చేసుకుంది? చూడు రాధా. పాలు పితుకుతున్నాడు పెయ్య అల్లరి పెడుతోంది ఒక్కసారి వెళ్ళి పట్టుకో,"అని సుభద్రమ్మ చెప్పగానే రాధ పెరట్లోకి వెళ్ళింది.

"బాగుందమ్మా, కావలసిన సంబంధాలు అలా వస్తాయి. అని వెంకమ్మ అంటూంటే, రత్నమ్మ కృష్ణమూర్తి, వచ్చారు లోపలికి.

రత్నమ "ఏం గూడు పురాణి చేస్తున్నారు తల్లీ కొడుకూను, అని నవ్వుతూ అంది.

"రా అక్కయ్యా, యిలా కూర్చో, ఏంరా కృష్ణుడూ బాగున్నావా''

"ఆ! ఏదో నీదయవల్ల''

"ఏదీ పిల్లలు? చంటాడు, రాధ, వీళ్ళందరూ ఏరి?''

"రాధ పెరట్లోవుంది, పిల్లలు ప్రవేటు కెళ్ళారు.

"అమ్మా తాళం ఏదీ తువాలు తీసుకో వాలి ముఖం కడుక్కుంటాను" అని కృష్ణుడన్నాడు.

"ఏం వదినా కాఫీ ఏమన్నా పెట్టనా, లేకపోతే అప్పుడే ఏడయింది భోజనం చేస్తారా అని సుభద్రమ్మ అడిగింది"

"అబ్బె, ఏమీ వద్దు, కొంచెంసేపు పోయాక భోజనమే చేస్తాము అని కృష్ణుడుకి తాళాలిస్తూ అంది. రామయ్య లేచి పెరట్లోకెళ్లాడు. రాధ పాలచెంబు పట్టుకొస్తుంటే, చూడు రాధా బావ మొఖం కడుక్కుంటాడుట, గోలెంలో నీళ్లున్నాయో లేదో చూడు, లేకపోతే పాలిగాణ్ణి కొంచెం పోసిపెట్టమన అని పురమాయించి మళ్ళీ వచ్చి యథాస్థానంలో కూర్చున్నాడు.

రాధ నిశ్శబ్దంగా, తల దించుకుని సావిట్లోంచి వెళుతూంటే, రత్నమ్మ, ఏమే రాధి, ఏదీ యిలారా, మాట్లాడకుండానే వెళ్ళిపోతున్నావు. అని, అంటే, రాధ వచ్చి రత్నమ్మకు కొంచెం దూరంలో కూర్చుంది, ఏం మాట్లాడకుండానే.

ఆరాత్రి, భోజనాలయ్యేదాకా ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు విశేషాలు. భోజనాల తరువాత మాత్రం, అందరూ వీధి వసారాలో పడక కుర్చీలమీద వక్కపొడులు వేసుకుంటూ కూర్చున్నారు. ఒక్క సుభద్రమ్మ తప్ప. రాధ వసారాపక్క చిన్నగదిలో, ఆలోచిస్తూ కూర్చుంది, తమ్ముడు చదువుకుంటూవుంటే. యింతట్లో సుభద్రమ్మ వంటిల్లు సవరించుకు, ఎడపిల్ల లిద్దరికీ పక్క వేసి పడుకోబెట్టి వీధి వసారాలోనే ఒకచాప పరుచుకు దానిమీద కూర్చుంది. అత్తగారికి తవలపాలు రాస్తూ.

రాధ మాత్రం, ఏం మాట్లాడుతారో ఏమిటో అని చెవులు నిక్కబొడుచుకు వింటూంది. కాని బావలో వచ్చిన ఈ మార్పుకు ఆలేత హృదయానికి అర్థం కాలేదు. లేకపోతే, ప్రతీఏట వేసంగి శెలవల్లో బావ వచ్చినప్పుడు ఎప్పుడూ తనని ఒక్క క్షణం, విడిచివుండనివాడు? అందులో రెండు మూడేళ్లనుంచి, మరీ ఎక్కువ ప్రేమతో చూసే, బావ, యిలా అయిపోతాడని కలలోకూడా అనుకోలేదు తను. ఎప్పుడూ తనను నవ్వించి నవ్వే బావ పోయిన శెలవల్లో వచ్చినప్పుడు, "రాధా ఈ ఏడుతో సరి చదువు, పెళ్లవగానే బొంబాయి తీసి కెళ్లిపోతాను వుండు, అని తనతో ఎన్నో హాస్యాలాడేవాడు వూరిలో కూడాఅందరూ తనఅదృష్టమే అదృష్టం

చిలకా గోరింకల్లాగ వుంటారు. అని అందరూ తన్ను చూసి అంటే ఎంతో గర్వపడేది తనకు రాబోయే భాగ్యానికి. కాని మధ్యాహ్నం నుంచి వచ్చి కనీసం ఒక్క మాటయినా మాట్లాడాడు కాదు, పరాయి దానిలాగ మరచిపోయాడు కాబోలు అని రాధ మనసులో ఆలోచిస్తూవుంటే సావిట్లో ఏవో మాటలు వినపడ్డంతోటి అవి జాగ్రత్తగా కిటికీలోంచి వింటూ కూర్చుంది.

"తమ్ముడూ కృష్ణుడి సంబంధం స్థిరపరచడానికి వచ్చానురా" అని మొదట రత్నమ్మే ఎత్తింది మాటలు.

"తెలిసింది."

"మరి రాధమ్మ సంగతి అంతేనంటావా" అని వెంకమ్మ మళ్లీ మొదటికి వచ్చింది.

"నాకు తెలియదు కృష్ణుడు లక్ష్మినే యిష్టపడ్డాడు, ఫోటోలో చూసే" నేను మాత్రం ఏం చేస్తాను. అని భారమంతా కొడుకు మీద పెట్టేసింది.

"మరీ యీ వుద్దేశాలు కొంచెం ముందుగా చెప్పితే, యింకో సంబంధం చూసేసే వాణ్ణి కదూ. ఎప్పుడూ మా కోడలు, మా కోడలు అనీ దానివి. కృష్ణుకు గూడా ఎప్పుడూ అదంటే ఎంతో యిష్టంగా వుండే వాడు, ఏమో యిలా అవుతుందని నాకు తెలియదు కదూ, అని రత్నమ్మ చెప్పబోయే మాటలకి సమాధానంతో గూడా రామయ్యే అనే వాడు.

"బాగుంది అనుకున్నదన్నీ అయిపోతాయిట్రా, యింతకీ దానికి చదువా సంధ్యా, రేపొద్దున్న మా వాడికి ఏ కలక్టరు పనో అవుతే, ఈ చదువురాని మొద్దు ఏం చేసుకోడానికి"

"మరి ముందర ఏడవ లేక పోయా రా చదువు కావాలని" అని రామయ్య కొంచెం గట్టిగా అన్నాడు కోపం వచ్చి.

కృష్ణమూర్తికి కోపం వచ్చింది. "బాగుంది నీ కూతుర్ని పెళ్లి చేసుకుంటానని ఎప్పుడైనా చెప్పేనేమిటి, ఏదో వేసంగి శెలవలకి చల్లగా వుంటుంది కదా అని ఈ వూరు వస్తే, నన్నూరుకే రాసుకొని అది తిరుగుతూ వుంటే ఏదో తప్పని సరిగ మాట్లాడే వాడిని. నాకే కావలసి వుంటే యిదివరకే అన్నీ చెప్పించి వుడమనేవాణ్ణి"

వెంకమ్మ ఒక నిట్టూర్పు విడిచి యింతకీ మాది తప్పు, ఈ విషయం మీరు యిలా మారిపోతారని ముందే తెలుస్తే, యిదివరకే ఏదైనా కట్టుదిట్టం చేసేదాన్ని అవును కాని ఎన్నిసార్లు నేను ఈ విషయం అడుగుతే ఏమని చెప్పేదానివి? కొడుకు చదువనీ, ఏం తొందర, ఎవరైనా ఎక్కడికి వెళ్లిపోయేవారా తొందరపడ్డానికి అని సతాయించే దానివి తీరా వాడు చదువుఅయింది కదా అంటే ఈ తంటసం తగిలించుకున్నావు, పోనీలే నీకలా న్యాయం అవుతే అలా చెయ్యి" అని అదోలా మొహం పెట్టి వూరుకుంది. సుభద్రమ్మ మాత్రం ఏమీ జోక్యంకలగజేసుకోకుండా మోకాలి మీద చెయ్యి పెట్టుకొని గోడ కానుకొని కూర్చుంది. యిక రాధ సంగతి చెప్పే అక్కరలేదు, అంతా అయోమయంగా వుంది.

రత్నమ్మ మళ్లీ "యిదుగో, రాధని చేసుకోటం లేదని మీరందరూ విరోధపడితే ప్రయోజనం లేదు, యింతకీ ఒక్కమాటతో చెప్పవలసిందంటే వాడికిష్టం లేదు. వాడికిష్టం లేంది నేను మట్టుకు ఏం చెయ్యగల నేం" అని తప్పించుకోడానికి చూసింది.

యింతట్లోకి పొలంవేపు వెళ్తూన్న రమణయ్య లోపలికి వచ్చి.

"అత్తా కొంచెం సున్నం యివ్వు" అని అంటూ సుభద్రమ్మ నడిగాడు.

"సున్నం వక్కటే యివ్వకూడదు, వుండు ఆకులు రాసిస్తాను. భోజనాలయా యేమిటి,

"ఊ"

"ఏరా రమణయ్య రాత్రి బయలుదేరవేం పొలానికి?"

"లేదు మామయ్యా, వెధవలు రాత్రి సమంగా కాపు కాయటం లేదు, దొంగతనా లొకటి జాస్తిగా వున్నాయి, అంచేత కొంచెం గస్తీ తిరగాలని వస్తుంది.

"కొండ వెధవల్లా, పొలాలుమీద పడడాలేమిటో, నేనూ వెళ్దామని వుంది కాని, ఒంట్లో ఏం అంత బాగులేదోయ్"

"పోనిలే నేను కొంచెం చూసుకుంటానులే" అని సుభద్రమ్మ రాసిన తమలపాకులు తీసుకొని వెళ్తూంటే రత్నమ్మ

"ఏం రమణయ్యా, అమ్మ పడుకుందా, మేలుకునేవుందా"

"లేదు ఏమిటో చదువుకొంటూంది. వస్తాను" అని అంటూ వెళ్లిపోయాడు.

కృష్ణుడు "ఇదుగో వీడున్నాడుగా, ఆ మొద్దుకు యీ మొద్దు సరిపోతుంది లే. తక్షణం కావలిస్తే, సిద్ధంగా వున్నాడు."

"అవున్రా తమ్ముడు కావలిస్తే మా వాడి పెళ్లితోనే చేసేద్దాము" అని కొడుకు మాటకి తాళం వేసింది.

రామయ్యకి ఎక్కడలేని కోపం వచ్చి "పోనీలే వాడికే యిస్తానో, మాలాడికైనా యిస్తాను. మీకు కాకపోయిందానికి మీకేదయితే నేం"

సుభద్రమ్మ వెంకమ్మ ఎవ్వరూ ఏమీ పలకలేదు. రాధ మాత్రం బావ ఏవిధంగా తనను అవమాన పరుస్తూంది, తనని తప్పించుకోడానికోసం ఎలా నీచంగా ప్రవర్తిస్తుంది అర్థం చేసుకొంది. మనుష్యులు వాళ్ల అవసరాలని బట్టి ఒకొక్కప్పుడు మానవత్వం కూడా పోగొట్టుకుంటారు కాబోలు అని రాధ అనుకోడం విచిత్రం కాదు. రాధకి యిప్పుడు బావమీద నిజంగా అసహ్యం కలిగింది. యిక బావని బ్రతిమాలి నా ప్రయోజనం లేదని నిర్ధారణ చేసుకుంది. తనంటే యింత అసహ్యం వున్న బావ మరి అంత మంచితనంగా, ఎందుకుండే వాడుకి రాధకి అర్థం కాలేదు. అంతా వట్టినటన. ఛీ యిలాంటి వాణ్ణి తన తప్పు ఏముందని అడగడం బతిమాలడం దేనికి, డబ్బుకోస

మేగా బావ మారి పోయాడు. యిక తను చేయవలసిన కర్తవ్యం. బావకోసమే ఏడుస్తూ కూర్చునేకన్నా బావని మరిచి పోవాలి, బావ తనని మరిచి పోయినట్టు. బావ తనంటే యిష్టపడితే ప్రాణం కూడా యిద్దునేమో అందుకే బావన్న మాటలకి నాకు అసహ్యం వచ్చింది. ఏవో ఆలోచనలతో అలాగే తనలో తాను వితర్కించు కుంటూ కూర్చుంది.

"యింతకీ, నాన్న గారికి నాకు యిష్టం లేదు. యిందులో విరోధానికేముంది, అని అంటూ కృష్ణమూర్తి లేచి తనకి పక్క వేసి వున్న కెంపుకొటు మీద కళ్లి పడుకు న్నాడు.

"పోనీలే నాయినా దాని రాతలో ఏం రాసివుంటె అదే అవుతుందంటూ" సుభద్రమ్మ పొందానా పట్టుకొని లేచి పడక గదిలోకి వెళ్లిపోయింది ఒకరి తరువాత ఒకరు ఎవరికి నిర్ణయించిన పక్కల మీద వాళ్లు పోయి పడుకున్నారు. రాధ మాత్రం ఏవో అర్థంలేని ఆలోచనలతో ఆ రాత్రి గడిపింది.

తెల్లవారగట్ల సుభద్రమ్మ వీధి గుమ్మంలో ముగ్గేసుకుంటూవుంటే రమణయ్య పొలం నుంచి యింటికి వెళుతూ, సుభద్రమ్మతో "అత్తయ్యా కాఫీ అయిందా" అని అడిగాడు.

"రావాయనా నీళ్లు మరుగుతున్నాయి, నీయిష్టమయినంత తాగు, యింతకీ, మీ అమ్మని నేర్చుకోమంటే. బలే అసహ్యం పడుతుంది కాఫీఅంటే" అంది నవ్వుతూ.

"అదంతా పాలుతాగడానికి చేసిన ఎత్తులే! దానికి పాలు తప్ప మరేమీ సహించవు! అస్తమానూ నిన్నే కష్ట పెట్టాలి, నేర్చుకోవే అంటే వినదు"

"బాగుంది నాయినా. నువ్వే పైవా పరాయిడివా, అత్తనుకాబట్టి స్వతంత్రించి అడుగుతున్నావు. లక్ష రూపాయలిస్తే పరాయిళ్ళదగ్గర పుచ్చుకుంటావా, రాధా, ఓసేవ్, రాధా, లే బావకి కొంచెం కాఫీ చేసి పెట్టు, నీళ్లు మరుగుతున్నాయి గుండ మాత్రం వెయ్యాలి, అని తల్లి చెప్పిన మాటలు వింటూ, రాత్రి సరిగా నిద్రలేక పోవడంచేత భారంగా లేచింది ఒళ్లు విరుచుకుంటూ రాధ.

"యిదుగో పిల్లా నేనిప్పుడే స్నానంచేసి వస్తాను, అత్తయ్య, బావ లేస్తే ఏంకావాలో చూసుకో, చిట్టిగాడు, గోపీకూడా లేస్తారు, యిప్పుడే వచ్చేస్తాను, రండి అత్తయ్యా, అని పువ్వులు సర్దుతూవున్న అత్తగారి దగ్గరకు వెళ్లింది, దేముడి గదిలోకి.

అప్పుడే లేచి దంతధావనం చేస్తున్న రామయ్య తనకికూడా ఓగ్లాసు కాఫీ చెయ్యమని చెప్పగానే రాధ "వుండండి బాబూ, నన్నొక్కసారి ముఖం కడుక్కోనీయండి, ఆ తరవాత మీరందరూ ఎన్ని పనులు చెప్పినా చేస్తాను, అని నూతి గట్టు మీద చతికిలబడింది. రామయ్య మొహం తుడుచుకోడానికి లోపలికి వెళ్లగానే, రమణయ్య రాధ దగ్గరకి వచ్చి,

ఏమే రాధి బావ నిన్ను చేసుకోనంటు న్నాడుకదా పోనీ, నువ్వు నన్ను చేసుకో గూడదు పెళ్లి? రాధ ఈ మాటలకి త్రుళ్లి పడింది. రమణయ్య ఎప్పుడూ, ఇలాంటి విషయం తనని అడగలేదు. కనీసం వాళ్ళ అమ్మయినా, ఈ వూసు ఎత్తలేదు హాస్యానికైనా. అలాంటప్పుడు రమణయ్య యిలా అడగడంలో వుద్దేశం ఏమిటి తనకి బావ చేసిన పరాభవమేమో.

"ఏం జవాబు చెప్పవు, ఏమి టాలోచిస్తున్నావు? ఏమీలేదు బావ వద్దన్నప్పుడు, నీకుమాత్రం నేనెందుకు కావాలని" పైటచెంగుతో మొహం తుడుచు కుంటూ కొంచెం సిగ్గుతో అడిగింది.

"నీలాంటి పెళ్లాం, ఎన్ని జన్మలు తపస్సు చేస్తేమాత్రం దొరుకుతుంది. నా యోగం, బాగుండబట్టి కృష్ణుడు నిన్ను చేసుకోవటం లేదేమో"

"ఊ! కాఫీ తీసుకుంటేసరి, కవిత్వం, చాలించి!! బావకూడా యిలాంటివి చాలా చెప్పేవాడు, తరవాత యిలా అడ్డంతిరిగాడు కాని. నాన్న గారూ, యిలా వస్తారా, కాఫీ తెచ్చిఇయ్యనా?"

"వస్తున్నానమ్మా, ఇక్కడ ఈ ఇద్దరి వెధవలు తగువూ తీర్చనీ, అంటూ చిట్టీ, గోపీ, పలప్పల్లల కోసం దెబ్బలాడుతూ వుంటే, వాళ్లని, కోంపడుతున్నాడు.

యింతలో, నదీ స్నానానికి వెళ్లిన అత్త, కోడలు, రాగనే రమణయ్య వెళ్ళిపోయాడు. రత్నమ్మ లేచి, పలుతోముకోడానికి, పుల్లకోసం, రాధని అడిగితే లేచి తేవడానికి వెళ్ళిపోయింది. ఏమే రమణయ్య వెళ్ళిపోతున్నాడా ఏమిటి ఉపాహ్మచేస్తాను వుండమను, లేదా వెళ్ళేనారమ్మను స్నానం చేసి, అని సుభద్రమ్మ అంటూంటే, యిప్పుడే వెళ్ళిపోయాడు, రాగానే చెప్ప లేక పోయావా, సరే చేసేక కబురు పంపించులే" అన్నాడు రామయ్య "ఏం వోదినా కాఫీ ఇచ్చేదా పాలు తాగుతారా"

అందాకా కాఫీ ఇయ్యి, అబ్బాయి లేచేక తక్కినవి చూద్దాం అమ్మా, అలా చలితో వణకకపోతే, మడిబట్ట కట్టుకో కూడదూ?

"నీలా నాకెలా అవుతుందమ్మా, దేముడి దగ్గర దీపం వెలిగించుకోండే ఎలా మైల పడను?"

"నిన్ను మైలపడమని అన్నానే, పొడిదే, మడిది కట్టుకోమన్నాను కాని"

"నాకు అలా పనికిరాదని నీకు తెలియదూ. పట్నాలు తిరిగి మొగుడితోటి, దొరసాని వయినావు కాని, నువ్వు నా కడుపున పుట్టిన పల్లెటూరిదానివేనా యిప్పుడంటే నీకు పట్నవాసాలు. పట్నవాసపు మనుష్యులు కొనలిసి వచ్చారు గాని"

"అస్తమాను దెప్పలే ఈ యింటికో స్త్రే," అని అనుకుంటూ కొడుకును లేపడానికి వెళ్ళిపోయింది రత్నమ్మ ముఖం చిట్లించుకొని.

ఆవేళ రామయ్య పొలానికి వెళ్ళలేదు. భోజనాలయాక సుభద్రమ్మ మాత్రం అత్తగారితో అంది. ఏం అత్తయ్యా, ఎలాగా ఓ అయిదువేలు ఖర్చుపెడదాం అని అనుకుంటున్నాంకదా, పోనీ యింకో రెండు

వేలు పోచ్చిస్తామంటే, ఒప్పుకుంటారేమో ఒదిన మన పిల్లని"

"అయ్యో పిచ్చిదానా, వాళ్లు నీతిమీద నిలబడాలి కాని, మనం, దాని ఆశ తీర్చగలమా, అది అంతా, పెద్ద ఆస్తులమీద వుంది ఎత్తు;" యింతట్లో రత్నమ్మ "ఏవట్టా, మిగూ రండి, నిశ్చయించుకోడానికి మేం వెళుతున్నాం, ఇప్పుడేమంచిదిట" అని అంది.

"............"

"మే మెవ్వరం రాము మీరు వెళ్లండి తగుదునమ్మ అంటూ మేమెందుకు" అని తల్లి అండంతో, చిన్నబుచ్చుకున్న మొఖంతో, కొడుకుని తీసుకొని వెళ్ళింది.

రామయ్య, రత్నమ్మ వెళ్ళగానే, కూతురు దగ్గరికి వచ్చి,

"ఏవమ్మా, ఏం బావ, నిన్ను చేసుకోటం లేదని విచారంగా వుందా"

"ఛా, లేదు నాన్న, నాకేం చేసుకోకపోతే"

"ఆ. అద్దీ. అంతేలే, నీ కిష్టమయిన వాణ్ణి తెచ్చి పెళ్ళిచేస్తాను ఈ పెళ్లేదో, అయిపోయిం తరువాత, నేను. అన్ని వూళ్లు తిరుగుతాను మంచి సంబంధాల కోసం, ఏవంటారమ్మా, అని అక్కడికి వచ్చిన తల్లి వేపు చూసి అన్నాడు.

"ఆ, అంతేలే నాయనా, యిక ఆడపిల్లలు మనకుమాత్రం మరి పుట్టేరా, మరి చేసేరా, చిట్టిగాడు పుట్టినప్పుడు అయిన ఆపరేషన్ వల్ల"

"ఆ అస్తమానం పదిసార్లు పుట్టరు పుట్టరంటే పుడతారా ఏమిటి, వీళ్లు చాల్లెండి,



అంది సుభద్రమ్మ వంటింటి తలుపు గొళ్లెం వేస్తూను.

ఆ రాత్రే, రత్నమ్మ, కొడుకు ముహూర్తాలు నిశ్చయించుకొని, ప్రయాణం కట్టేరు బండీలో.

వెళ్లే ముందు రత్నమ్మ రాధని పిలిచి వచ్చేనెల్లోనే బావ పెళ్లి నువ్వు మంచి మంగళహారితి పాటలు అవీ నేర్చుకో, మంగమ్మత్త దగ్గర"

"ఓ ఒక్క మంగళ హారతి పాటలేమిటి జోల పాటలు కూడా నేర్చుకుంటుంది" అని హేళన చేసేడు రామయ్య.

వాళ్లు వెళ్లగానే, రామయ్య, సుభద్రమ్మ భోజనానికి వంటింట్లోకి వెళ్లేరు, గోపీ, చిట్టి ఎక్కాలు చదువుతూ కూర్చున్నారు చావిట్లో.

వెంకమ్మ, రాధా మాత్రం వెన్నెట్లో కూర్చున్నారు, వీధి వాకిట్లో.

"మామ్మా చూసేవా బావ వచ్చిన దగ్గర నుండి ఒక్క మాటైనా మాట్లాడకుండా పోయాడు."

"అయ్యో పిచ్చితల్లీ, వాడి కళ్లు నెత్తిమీదున్నాయి. అమ్మమ్మనని నా మీద మాత్రం ఏవైనా అభిమానం వుండి ఏడ్చిందిటమ్మా?"

రమణయ్య పొలానికి పోతూ, "అమ్మమ్మా మావయ్యేడి?" అంటూ లోపలికి వచ్చాడు.

"భోంచేస్తున్నాడు నాయినా, ఏదీ మంగమ్మ, మరీ యింట్లోనే కూరుపోతుంది కొంచెం రామాయణం ఏమైనా చదువుతుందేమో అని అనుకుంటే"

"బాగు, బాగు, యిప్పుడు అదే చదువుతూంది. నువ్వు పడుకొన్నావేమో అని అనుకొని నిన్ను పిలవలేదు"

"అయ్యో చదువుతూందా, ఒసే రాధమ్మ యిప్పుడే వస్తా, తలుపు జాగ్రత్తా చూడు, కొంచెం సేపు రామ- కృష్ణా అనేనా అనుకుంటూ" అని అంటూ మంగమ్మింటివేపు దారితీసింది.

రమణయ్య సమయం దొరికింది కదా అని, "రాధా నిజం చెప్పు, యిప్పుడైనా నేనంటే నీకిష్టం లేదు?"

"బావ వద్దన్నాడు కదా అని నిన్ను విధిలేక చేసుకుంటా ననుకొన్నావా" రాధ కంగించి అడిగింది కొంచెం.

"ఛా, నీ యిష్టమే"

"నా యిష్టం ఏముంది, యిష్టా యిష్టాలకి అమ్మ నాన్నగారు..."

"ఆగు! మొదట నీ యిష్టం కావాలి నాకు. నువ్వు మనస్ఫూర్తిగా యిష్టపడితే తరవాత వాళ్లు. ఆ తరవాత బావ పెళ్లి అవగానేనో అంతకు ముందరో, ఎప్పుడో పెళ్లి చేసేసుకుందాం"

అని రమణయ్య అంటూ వున్న మాటలకి రాధకి ఎంతో జాలి వేసింది.

"మరి బావంటే నేను, నేనంటే బావ అంత యిష్టపడే వాళ్లంకదా, నీకళ్ల ముందే బావ ఎన్నోసార్లు తన పెళ్లాన్నని హాస్యాలాడేవాడు, మరి నీకు కష్టంగా లేదు, అన్నీ తెలుసుండీ కూడా"

"ఏం నువ్వేం తప్పు చెయ్యలేదుగా, హాస్యాలాడినంత మాత్రం తప్పేమీ లేదే, యింతకీ, నాకు కావలసింది నువ్వు. నీ సంగతులు నాకనవసరం, నీకిష్టం లేకపోతే చెప్పు నేనేం అనుకోనులే"

రమణయ్య విశాల హృదయానికి రాధ ఆశ్చర్యపడింది. తనంటే ఎంతో యిష్టం రమణయ్యకి.

"సరేలే నేనే పెళ్లి చేసుకుంటే నిన్ను చేసుకుంటాలే" అని రాధ వెనక్కు తిరిగి చూడకుండా, లోపలికి పరిగెత్తింది. రమణయ్య అలాగే ఆలోచనలో పక్కనున్న కుర్చీలో కూర్చుండి పోయాడు, రాధ అర్థం తెలియక.

రాత్రి సుభద్రమ్మ అడిగింది, రామయ్యను, "పోనీ రాధని రమణయ్యకిచ్చెయ్య కూడదా, ఏదో అదీ మేనరికం లాంటిదే కదా" అని.

"నిజమే అక్కయ్య, వాడు రమణయ్యని చెప్పకుండా వుంటే రాధని వాడికే యిచ్చేద్దును. కాని వాళ్లు వాణ్ణింతో చులాగ్గా అనేసేరు కాబట్టి, దాని కొడుక్కన్నా మంచి వాణ్ణి మనం తేవాలి అంతేనా"

"ఆ, నిజమేలెండి. యింతకీ ఏది మన చేతుల్లో లేదు. ఎలారాసి వుంటే అలాగ జరుగుతుంది" అని అంటూ, సుభద్రమ్మ పడకగది వేపుకు వెళ్లింది, పిల్లల్ని పడుకో బెట్టడానికి.

* * *

కృష్ణమూర్తి పెళ్లి ఓ మూడు రోజులుందనగానే, రత్నమ్మ మొగుడు సుందరం పంతులు మంగమ్మింట్లోనే సరంజాం అంతా పెట్టేరు, బంధువులతో–పెళ్లివాళ్లకి వేరే విడిది అవుసరం లేకుండా.

పెళ్లి లేపనగా కృష్ణమూర్తి వచ్చాడు. సాయంత్రం ప్రధానం రమ్మని పిలిస్తే, రామయ్య వాళ్లు ఎవ్వళ్లూ రావన్నారు. కావలిస్తే రేపు పెళ్లికి వస్తాం అని చెప్పేశారు. రాధని మాత్రం బలవంతం మీద తనతో తీసికెళ్లింది తీరా ప్రధానం లగ్నం. అని ముహూర్తం పెడితే, ఆరు ఘంటలయినా ఆడ పెళ్లి వారు పిల్లని పీటల మీదకి తీసుకు రాకపోడం చూసి రత్నమ్మే లోపలికి వెళ్లింది వెతుక్కుంటూ. యింకేముంది పెళ్లి కూతురికి ఫిట్స్ వచ్చి పడిపోయి వుంది. రత్నమ్మ అయోమయ పడినట్టయింది. రోదు

కుంటూ వచ్చి మొగుడితోటి ఆయనతో బంధువులతోటి పెద్ద పెద్ద కేకల్తో చెప్పడం మొదలు పెట్టింది. కృష్ణమూర్తి మొహాన్న నెత్తురు చుక్క లేదు కత్తి వేటుకైనా. సుందరం నానా చీవాట్లు పెట్టాడు పెళ్లాన్ని కొడుకుని ఏదీ కనుక్కోకుండా, నిశ్చయించు కున్నందుకు సంబంధాన్ని. పెళ్లికూతురు మేనమామ సీనయ్య అక్కడికి రావటంతోటే రత్నమ్మ నానామాటలు దుయ్య బట్టుకుంది. మొగుడుతో కలిసి.

"ఏం అన్యాయం, మా కంట్లో కారం జల్లి మా వంశ నాశనం చేసేద్దా మనుకున్నారా, ఈ మూర్ఛ రోగపు పిల్లిని మా మెడకు కట్టి. ఏరీ, నీ అక్కయ్యా, బావ, రమ్మను మొహంమ్మీద వుమ్మేస్తాను," సీనయ్యకి ఒళ్లు మండింది.

"ఎందుకే వుమ్మతావు, రోగంవున్న ఆ తమాత్రం పిల్ల పనికొచ్చింది కాదు నీకు. నీకు పిల్లే కావలిసుంటే, నీ మేనగోడల్నే చేసుకోందువు, చందమామలాంటి దాన్ని. డబ్బుకోసం ఆశపడ్డదానివి అలాగే వుండు, పై పెచ్చు మాట్లాడావంటే..." పెళ్లికూతురి తల్లి, తండ్రీ, వచ్చి, సంబంధం ఎక్కడ తప్పిపోతోందోనని, సీనయ్యని వారించడానికి ప్రయత్నించారు, కాని, రెండుపక్షాలు,మాటల్లోతీసిపోకుండా తిట్టుకోడం మొదలు పెట్టారు, ఒకరిమాట ఒకరికి బోధపడకుండా.

"అయితే, నీ తుచ్ఛపు డబ్బు నాసించి, కొడుక్కి పెళ్లిచేస్తున్నానని అంటావా, నీడబ్బు వద్దు, నీపిల్లవద్దు మాకు," అని సుందరం, పంతులు, ముందుకువచ్చి, కను బొమ్మలు ముడుస్తూ మండిపడ్డాడు.

"ఆ! ఆ! చాల్లే, చాలా మందిని మా సేం, మీయంటివాళ్లని, నీ తాతల్లాంటి వాళ్లు, యిప్పటికే వున్నారు, పిల్లని చేసుకోటానికి, ఏదో గ్రహబలం చాలక, మీలాంటివాళ్లు తారస పడ్డారు కాని.." అని యింకా సీనయ్య ఏదో అంటూంటే, పెళ్లికూతురు తల్లి, తండ్రి, యింకా ఏదో చెప్పబోతూండగానే, రత్నమ్మ, మొగుడు, అవి ఏవి వినిపించుకోకుండా, కొడుక్కోసం వెతుక్కోడం మొదలుపెట్టేసు పైకి వచ్చి.

"ఏడీ, కృష్ణుడూ, ఎక్కడికి వెళ్లేడు, ఈ అల్లరిచూసి,"

"ఏమో పాపం యింటికి వెళ్లిపోయాడేమిటో పదండి మీరు, నేను, మంగమ్మ, యిక్కడి సామాన్లు, సర్దుకొని వచ్చేస్తాము. మనకింకొద్దండి, ఈ సంబంధం. యింత అవమానం చేసిన మీదట, అని అంటూ రత్నమ్మ చెప్పడంతోటే, తక్కిన బంధువులతో, సుందరం ఏదో మాటల్లో పడ్డాడు. పెళ్లికూతురు తాలూకువాళ్లు కొయ్యబొమ్మల్లా ఏం పాలుపోక చూస్తూ నిల్చుండిపోయారు అలాగే.." అయితే అబ్బాయి ఏమంటాడు, తీరా వాడిని ఏదీ అడక్కుండా..." అని రత్నమ్మ అంది.

"వాడికేం యిష్టం, నీమొహం, పద, వాడు అసలు యిష్టంలేకే వెళ్లిపోయాడు. యిష్టంవున్న వాడయితే, మనల్ని వూరుకోమనేవాడుకదూ ఈపాటికి అని అంటూ అందరూ యింటిముఖం పట్టేరు.

ఈ సంగతి మెల్లిగా అందరికీ తెలియగానే, రత్నమ్మ, అమ్మ, తమ్ముడూ అందరూ వచ్చేరు పరామర్శించడానికి, మగమ్మ యింటికి.

"చాలు, చూడ్డానికి రమ్మంటే, కళ్లు లేకపోయాయిగాని, సంబంధం, నాశనంఅయిందంటే సంబరపడ్డానికి కామాలు వచ్చారు.

"అయ్యో పిచ్చిదానా, యిలా అవుతుందని కలగన్నామా, మాకేం రోగం వచ్చిందా నిన్ను చూసి సంబరపడ్డానికి, నువ్వు విచారపడుతూ వుంటే ఏడీ అల్లుడూ, అంటూ వీధి అరుగుమీద ఆలోచనా విచారాల్లో, మునిగి తేలుతూవున్న సుందరంపంతులు దగ్గరకివెళ్ళింది వెంకమ్మ.

"ఏమిటి అత్తగారూ, యిలా పోనీ, పిల్లకి రోగం వుందని, ఒక్కరోజు ముందరైనా మీరు వుత్తరం రాస్తే, యింత అల్లరి లేకపోనుకదా"

"లేదు నాయనా, మాకుమాత్రం ఏం తెలుసు, యిలా పిల్లకి జబ్బుందని.మరి వాళ్లు పైకి తేలీనీయకుండా కప్పిపుచ్చుకున్నారాయె. యింతకీ, తెలిసివున్నా, మీరు ఆ మొగ్గుమీద వున్నప్పుడు నమ్మతారా నాయనా, చెప్పితేమాత్రం, మామాట"

"బావా, అయిపోయిందేదో అయిపోయింది, ముందు కర్తవ్యం ఆలోచించుకోండి. వూరికే, విచారపడితే లాభంలేదు. ఏడీ కృష్ణుడు, వాడితో ఆలోచిస్తే, అన్నీ తేలిపోతాయి," అని, రామయ్య, పొగాకు నలుపుతూ అన్నాడు.

"వాడు, ఆ సామాన్లగదిలో కూర్చున్నాడు, పాపం వాడికైనా ఎంత అవమానం? ఒరే రమణయ్యా, వాణ్ణి కొంచెం బయటికి పిలువు అంటూ వెంకమ్మ ఆజ్ఞతో, రమణయ్య లోపలికి వెళ్లి, కృష్ణమూర్తిని తీసుకొచ్చాడు.

"వుండత్తా, యింటికి వెళ్లి, యింత వంటైనా చేస్తాను మీరందరూ పస్తుఅయిపోగలరు, తరవాత మాట్లాడవచ్చు"

"వద్దు, అమ్మమ్మా అప్పుడే వంట వాళ్ళకి కబురు పంపించాను, వచ్చేస్తే మూడు నిమిషాల్లో అయిపోతుంది. యింత మందికీ, నీవొక్కర్తివి ఏంచెయ్యగలవు, అన్నాడు, రమణయ్య.

"పోనీ, వాళ్లల్లో ఏమయినా తప్పుందని, కొంచెమయినా మాట సంబాళించుకొని మాట్లాడేరా, మనమీద వూరికే పడిపోయారు ఏం, ఆ అక్క, బావ, అలా తమాషా చూడకపోతే, ఆ సీనయ్యకి గట్టిగా చెంపలు వాయించెవుంటే, నా కంత కోపం రాకపోను, అంది రత్నమ్మ లోపలనించి వచ్చి.

"చాల్లెద్దూ, మహా కుదిర్చేశారు తల్లీ కొడుకూను. నా పరువుకూడా తీసేశారు. నేనేదో ఆశపడి డబ్బుకోసం ఆ సంబంధం ఒప్పుకొన్నట్టు. ఏంరా, ఏమీ మాట్లాడవు, ఏం చెయ్యమంటావు చెప్పు?

"నాకేం తోచటంలేదు నాన్నా, మీ యిష్టమే మూర్ఛరోగంవుంటే ఎవరుచేసుకుంటారు? యింతకీ, మన్నంత కళ్లు కట్టి, నాటకం ఆడాలని చూశారు వాళ్లు"

"ఏమో నాకేం తెలియదు. తీరా, మేనరికం, వదులుకొని, పై సంబంధం చేసుకుంటున్నామని, లోకులు, అనేకం అనుకున్నారు. యిప్పుడు ఇదికూడా, సున్న చేసుకొని, వెళితే అందరూ, ఏమంటారు? అంచేత చచ్చినట్టు, మళ్ళీ తల్లీ కొడుకూ వెళ్ళి, కుమార్పణ వేడుకోండి వాళ్ళనే.

"నా కంఠంలో ప్రాణం వుండగా, యిక ఆ సంబంధం చేయను. మీరు వాళ్లు ఏమైనాసరే, అంతగా అయిందా, రాధనే చేసేస్తాను, ఈ క్షణంలో." రత్నమ్మ, ఆ మాట అందిగాని, ఎవ్వరూ ఒప్పుకుంటారో లేదో, ఆఖరికి తన తమ్ముడైనా, ఈమాట వింటే ఏమంటాడో అన్న విచక్షణకూడ లేక పోయింది. తలుపుచాటునున్న సుభ

(47-వ పేజీ చూడండి)

నాటిక :

# రాగోదయం

రంగారావు : ఆఁ మీ సంగతేమిటో చెప్పండి.

చక్రధరరావు : నేను బి. ఏ. ఆనర్సు ఆఖరిసంవత్సరం చదువుతున్నానండి. పరీక్షలకి డబ్బుకట్టాలి. సహాయం చేస్తారని ఆశిస్తున్నాను.

రంగా : ఎంత ?

చక్ర : వంద రూపాయలు కావాలి.

రంగా : మీ కెంతకావాలో నే నడగటంలేదు. నే నెంతసహాయం చేస్తానని మీరు (ఆగి, వొత్తిపలుకుతూ) ఆశిస్తున్నారు !

చక్ర : వంద రూపాయలు...

రంగా : (ఆశ్చర్యంగా) వంద రూపాయలా ? దురాశ దుఃఖానికి చేటు అనే మాటలు మీరు వినలేదల్లే ఉంది.

చక్ర : క్షమించండి, ఇందులో దురాశ ఏమీ లేదు. అవసరంకొద్దీ అడిగాను. మీరు ఇవ్వగలరు. కనుక ఇవ్వమని కోరుతున్నాను.

రంగా : ప్రార్థిస్తున్నాను అనటం అంతకంటె మంచిమాటకదూ ?

చక్ర : నేను మాటలు తూచివాడతాను.



రంగా : సహాయంకోసం అర్థించటం ఇలాగేనా ?

చక్ర : నేను అర్థిస్తున్నమాట నిజమే. కాని అందుకు నాకు హక్కుంది.

రంగా : అంటే ?

చక్ర : నేను ఆగర్భదరిద్రుణ్ణి. పుట్టిన మనిషి చదువుసంధ్యలు నేర్చుకునిసవ్యంగా బతకటానికి డబ్బు ముఖ్యావసరం. అది నాదగ్గిర లేదు. లేకపోవటానికి కారణం నేనుకాదు. ఇలాంటి అసహాయస్థితిలో నే నుండటానికి కారణం సమాజం – సమా

## "హితశ్రీ"

జంలోని శ్రీమంతులు. ఆ శ్రీమంతుల ఎదుట చెయ్యిజాపటానికి నేను సిగ్గుపడను. జాలిగా అడగను. హక్కు ఉన్నచోట ప్రార్థించాలిసిన అవసరమేముంది ?

రంగా : వాళ్లివ్వకపోతే ?

చక్ర : శ్రీమంతుడు అనేమాటకి నిర్వచనం తెలిసినవాళ్లెవరూ అలా అనరని నా నమ్మకం.

రంగా : ఇప్పుడు నే నేమీ ఇవ్వననుకోండి. ఏం చేస్తారు ?

చక్ర : మీరు విన్నా వినకపోయినా, మీ కర్తవ్యాన్నిగురించి ఓ-చిన్న లెక్చరిచ్చేసి వెనక్కి తిరిగి వెళ్లిపోతాను.

రంగా : హహ ! ఆ లెక్చరేమిటో కొంచెం ముందుగానే వినిపించండి.

చక్ర : క్షమించాలి, మీరు వృథాగా కాలయాపన చేస్తున్నారు. టైం మీకూ నాకూ కూడా విలువైంది. నన్ను త్వరగా పంపమని కోరుతున్నాను.

రంగా : వెళ్ళండి, ఎవరొద్దన్నారు?

చక్ర : మరి...మీ రేమీ ఇవ్వరా?

రంగా : ఊఁహూఁ...

చక్ర : డి. ఎస్. పి. ఉద్యోగంచేస్తున్న మీకే డబ్బు అంత ప్రాణప్రదమైతే, నాబోటి విద్యార్థికి అదెంత అవసరమో ఆలోచించండి. డబ్బంటే మీకు మోటారుకార్లూ, కుషన్ కుర్చీలూ, రేడియోలూ, పంచభక్ష్యపరమాన్నాలూ; ఇహ మాకు డబ్బంటే తిండి, బట్ట, చదువు. రూపాయలు మీ దృష్టిలో వెండినాణాలూ కాగితాలూ. కాని వాటి నిజస్వరూపం తెలుసుకోండి. కార్మిక, కర్షకుల అహోరాత్రాల అనవరతశ్రమే రూపాయల రూపంలో ఘనీభవిస్తుంది. వాటి విలువ తెలిస్తే మీరు నన్నిలా వొట్టిచేతుల్తో ఎన్నటికీ పంపేవారుకాదు. మానవుడి శ్రమఫలితమైన సంపద మానవాభ్యుదయంకోసమే ఉపయోగపడాలని మీరు తెలుసుకోగల రోజులు త్వరలోనే రాగలవు. రావలసిన విప్లవం మీలాంటివారి చర్యలవల్ల మరింత త్వరగా రాకతప్పదు. సెలవు.

రంగా : ఆగండి. మీ లెక్చర్ బాగానే ఉంది. కాని మీ అమాయకత్వం చూస్తే నాకు జాలేస్తోంది. తలుచుకుంటే మిమ్మల్ని నేనిప్పుడు అరెస్టుచెయ్యగలను.

చక్ర : ఎందుకు ?

రంగా : మీరు మాట్లాడిన మాటలవల్ల శాంతి, భద్రతలు మీవల్ల భగ్నంకావటానికి అవకాశముందని ప్రభుత్వం నమ్మటానికి ఆధారం ఏర్పడ్డది. మీవల్ల ఎటువంటి విద్రోహ చర్యలూ జరక్కుండా చూడటం ప్రభుత్వం విధి.

చక్ర : నిజం మాట్లాడటమే విద్రోహచర్య అయితే నన్ను మీరు అరెస్టుచెయ్యవచ్చు. కాని...

రంగా : కాని ఏమిటోయ్ పిచ్చివాడా, ఆ అమాయకత్వం చూసే నవ్వుతున్నాను. ఈ రోజుల్లో పోలీసు సూపరింటెండెంట్ ముందు విప్లవంగురించి మాట్లాడటానికి సాహసించటం ప్రపంచానుభవం ఏమీ లేదని చాటుకోటం.

చక్ర : కావొచ్చు. ఇక నాకు సెలవియ్యండి.

రంగా : సహాయం అక్కర్లేదా ?

చక్ర : ఇవ్వనన్నారుగా.

రంగా : మీ లెక్చరు వినటానికలా అన్నాను.

చక్ర : ఓ...

రంగా : నాకు మీకు సహాయం చెయ్యాలనే ఉంది—వీలైనంత ఎక్కువగా కూడా. కాని చూడండి మగవాళ్ళ చేతులు కర్కశమైనవి. అందులోనూ పోలీసువాళ్ళ చేతులు మరీ. అంచేత అవిచేసే సహాయం మీకంతగా లాభించకపోవచ్చు...ఆ కనపడే మెట్లమీదనించి మేడమీదికి వెళ్ళండి. స్త్రీల హస్తాలు పువ్వులకంటే మెత్తనివి. (నవ్వుతూ) తరవాత మీ అదృష్టం. ఇంకో చిట్కా కూడా చెబుతాను. నే నిలా అన్నానని, అక్కడనండి, ఉత్తచేతుల్తో తిరిగిరారు. (మెట్లు ఎక్కుతున్న చప్పుడు)

చక్ర : ఈ మహానుభావుడు భార్యా విధేయుడు కాబోలు, ఎంత సున్నితంగా చెప్పాడా సంగతి...ఎవరండీ లోపల ? (తలుపుతట్టిన శబ్దం)

విజయ : (లోపలినించి) ఎవరు ?

చక్ర : నేను ఒక విద్యార్థిని. మీతో కొంచెం మాట్లాడాలని...

విజయ : ఏం కావాలి ?

చక్ర : ఆర్థికసహాయం.

విజయ : ఇక్కడెవరూ ఉప్పు పప్పు పోసుకు కూచో లేదు, పంచిపెట్టటానికి.

చక్ర : (తీక్ష్ణంగా) పంచిపెట్టటానికి ఉప్పుపోసుకోకపోవచ్చు. కాని ఉప్పు ఉన్నదని తెలిసే వొచ్చాను.

విజయ : (కోపంగా) ఎవరు నువ్వు ? కానిస్టేబిల్—

చక్ర : మీకు బాగా కోపంవొచ్చినట్టు మీమాటల్నిబట్టి తెలుస్తోంది. మీరు తలుపు తీసి నన్ను లోపలికి రానిస్తే మీకు కోపం రావాలిసిన అవసరం లేదని నచ్చచెప్పగలను.

విజయ : ఏమి టీ అతివాగుడు ?

చక్ర : క్షమించండి. నేను వాగ్వాదం పెంచటానికిక్కడికి రా లేదు. మీతో రెండు మాటలు మాట్లాడి మీరివ్వగల సహాయం తీసుకు పోదామని మాత్రమే నా ఉద్దేశం.

విజయ : ఇక్కడ దానకర్ణులెవరూ లేరు. అనవసరంగా గొడవచెయ్యక వెడితే బాగుంటుంది.

చక్ర : స్త్రీల హస్తాలు పువ్వులకంటే మృదువైనవని...

విజయ : షటప్...ఏమిటా కూతలు ? ఎవరు నువ్వు ? కానిస్టేబిల్...(తలుపు దఢాలున తెరిచిన శబ్దం)

చక్ర : (తెల్లబోయి) మీరా...విజయ.

విజయ : (ఆశ్చర్యంతో)......చక్రధరరావుగారా...(సిగ్గుపడి)...క్షమించండి ఎవరో అనుకున్నాను.

చక్ర : మీరు డి. ఎస్. పి. గారికుమార్తె అని నాకు సమయానికి స్ఫురణకి వొచ్చి ఉంటే బాగుండేది.

విజయ : (పొరపాటును సవరించుకొంటూ) మీరు మరోవిధంగా అనుకోకండి. రోజూ చందాలకని వొచ్చేవాళ్లతో ప్రాణం విసిగి అలా...

చక్ర : వొస్తా సెలవు.

(మెట్లు దిగుతున్న శబ్దం)

రంగా : హాలో ఏమయింది ?

చక్ర : తేలికగా వొచ్చి బరువుగా వెడుతున్నాను.

రంగా : (నవ్వి) నేను చెప్పలా? స్త్రీల హస్తాలు...ఆఁ...అన్నట్టు మీ పేరేమిటి?

చక్ర : చక్రధరరావు.

రంగా : చూడండి, చక్రధరరావుగారూ మీరంటే నా కెందుకో ఒకవిధమైన ఇష్టత ఏర్పడ్డది. బహుశా మీ మాటల్లోని నిష్కాపట్యం మీ అమాయకత్వం చూసేనేమో? మీ పేరు జ్ఞాపకం ఉంచుకుంటాను. బి. ఏ. ఆనర్సు కాగానే నాకు కనిపిస్తే మీకు మంచి ఉద్యోగం దొరికేలా ప్రయత్నం చెయ్యగలను.

చక్ర : థాంక్స్. (నిష్క్రమణ)

విజయ. (మెట్లు దిగుతూ) చక్రధరరావుగారూ (హాలులోకి వొచ్చి రంగారావుని చూసి హఠాత్తుగా ఆగి) మీ రిక్కడే ఉన్నారా ? నాన్నా.

రంగా : అవునమ్మా. అన్నట్టు మీనాక్షి సరుగా రమ్మాయి ఫోన్ చేసింది. ఇవాళ మీ ఎకనమిక్స్ ఆనర్సువాళ్లు పిక్ నిక్ చేసుకుంటున్నారటగా...వాళ్లింటి కెవళ్లో చుట్టాలొచ్చారట...అరగంట అటూ ఇటూగా వొస్తుందిట...నిన్ను తనకోసం ఎదురు చూడవొద్దంది.

విజయ : (అంతగా వినిపించుకోక) ఊఁ మీ రిక్కడే ఉండి అతన్ని పైకి పంపించా రెందుకూ.

రంగా : (నవ్వుతూ) స్త్రీల హస్తాలు పువ్వులకంటె మెత్తనివని...

విజయ : (అప్రయత్నంగా) ఆఁ.

రంగా : మీ అమ్మ సంగతి తెలిసిందేగా బరువుగా వెడుతున్నా నన్నాడు. ఎంత వొదిలించా రేమిటి ?...అదేమిటే చేతిలో ఆ నోటేమిటి? ఇంకా కొత్త బరువు వెయ్యమంటేమిటి మీ అమ్మ...

విజయ : (తెప్పరిల్లి) ఆఁ ఊఁ లేదు. నేనే అతను మా క్లాస్ మేట్...

రంగా : ఓ అవునవును. అతనూ బి. ఏ. ఆనర్సు అనే చెప్పాడుకదూ. అప్పుడే అడుగుదామనుకున్నా, కానిమర్చిపోయాను. పాపం. వొట్టి పిచ్చివాడు. నా కిప్పటికీ నవ్వొస్తోంది. హా హా హా ! డి. ఎస్. పి ముందు ఇంత తెలివితక్కువగా మాట్లాడే వాడినెవర్నీ చూల్లేదు నేను— (నవ్వుతాడు)

* * *

[పిక్ నిక్ సందడి. దూరంలో గ్రామఫోన్ రికార్డు సంగీతమూ కోలాహలమూ వినిపిస్తూ ఉంటుంది]

విజయ: రమకూడా వొస్తే వంటపని చాలా తేలిగ్గా ఉండేది. మన ముగ్గురివల్లా తెమిలేట్టులేదు.

చక్ర: రమ ఎవరు?

విజయ: హెల్తాఫీసరు గారి అమ్మాయి, ఫోర్త్ ఆనర్స్ ఎకనమిక్స్.

చక్ర: ఓహో కానియ్యరా చంద్రశేఖరం, తరగాలిసిన కూరలు చాలా ఉన్నాయి. వేగం హెచ్చించు.

(విజయ చిన్న కేక వేస్తుంది) ఏమి టది? ఏం జరిగింది.

విజయ: ఏం లేదు లెండి. కాలిమీద వేడినీళ్లు కాసిని పడ్డాయి.

చక్ర: చూస్తే మీ వల్ల ఏం పని జరిగేటట్టు లేదు. ఆ అమ్మాయి ఎందుకురానట్టు?

విజయ: ఓ అరగంట అటూ ఇటూగా వొస్తానని ఫోన్ కూడా చేసింది. ఎంచేతో ఇంకా రాలేదు.

చక్ర: సరే, మీరక్కడినుంచి తప్పుకోండి, ఆ పనేదో నేను చూస్తాను.

విజయ: మీకు మాత్రమేం చాతవును?

చక్ర: చాతకాకపోతే ఎలా గడుస్తోం దనుకుంటున్నారు? అందరూ మీలా సుకుమారంగా పెరగగలరా?

చంద్రశేఖరం: వంటచెయ్యటం వాడి కలవాటే లెండి. లేకపోతే ఏ రోజూ హోట్లోకి వెళ్లుపోవు వాడికి.

విజయ: (ఏమీ అనటానికి తోచక) నాకంటే మీరే నయమన్నమాట...

చక్ర: మీరు కిందపడుతున్నట్టు నటించాలిసిన అవసరమేం లేదనుకుంటాను.

విజయ: మీరు పోట్లాడే స్వభావం కలవారని నాకు తెలుసు. అందులో ఇవాళ కారణం కూడా ఉంది.

చంద్ర: ఏమిటో కారణం?

చక్ర: క్షమించాలి. ఆ విషయం నేనింకా మనసులో పెట్టుకునే ఉన్నానను కుంటున్నారా?

చంద్ర: ఏమిట్రా అది?

విజయ: పోనీండి, ఇప్పుడీ వాగ్వాదం ఎందుకు? కులాసాగా కాలం గడపటానికి వొచ్చి వాగ్వాదాలు పెంచుకోటం సమంజసం కాదు.

చంద్ర: చక్రధరరావు సంగతి మీకు తెలిసిందేగా, మాట తొందరమనిషి. వీడికీ దురలవాటు ఎలా పోతుందో నాకేం తెలియటంలేదు.

చక్ర: కొన్ని దురలవాట్లు మనిషితోనే గాని అంతంకావు.

చంద్ర: సంతోషించాంలే. అన్నం పొంగుతున్నట్టుంది చూడు.

విజయ: దురలవాటు అని తెలిసినదాన్ని విడిచిపెట్టలేకపోవటంకంటె మానసిక దౌర్బల్యం ఇంకేదీ లేదేమో...

చక్ర: ఈ రోజుల్లో సామాన్యమానవుడు అనేక దౌర్బల్యాలచేత పీడించబడుతున్నాడు. కొన్ని సంఘం బలవంతాన అతని తలమీద రుద్దినవీ, కొన్ని తనంతటతను తెచ్చిపెట్టుకున్నవీ. నేనూ సామాన్యమానవుణ్ణే. శ్రీమతి విజయకీ చంద్రశేఖరానికీ ఏవిధమైన దౌర్బల్యాలూ లేవేమో బహుశా...

విజయ: (అహంతో) బహుశా లేకపోవొచ్చు.

చక్ర: నిజం ఒప్పుకోలేకపోవటం దౌర్బల్యం కిందికి రాదేమో...

విజయ: అదెలా ఉన్నా, నిజంచెప్పటమనే మిషతో ఇతర్లని అవమానించటం, వాళ్ళ హృదయాలకి బాధ కలిగించటం విచిత్రమైన దౌర్బల్యం

చంద్ర: ఎందుకీ ఎత్తిపొడుపులు! చక్రధర్! నువ్వు విజయని క్షమాపణ అడగటం సమంజసం.

చక్ర: అందుకు నాకెటువంటి అభ్యంతరమూ లేదు. (నవ్వుతూ) శ్రీమతి విజయ మనస్ఫూర్తిగా నన్ను క్షమించుగాక...

విజయ: మీరెంతకోపం వొచ్చేట్టు మాట్లాడతారో అంత నవ్వొచ్చేట్టుగా కూడా మాట్లాడతారు. మొదటి గుణం మాత్రమే ఉన్నట్టయితే మీ రసలు ఏ ఉద్యోగమూ పట్టుమని పదిరోజులైనా చెయ్యలేరేమో...

చక్ర: నిజం చెప్పాలంటే నాకసలు ఉద్యోగం చెయ్యటం ఇష్టంలేదు.

చంద్ర: కాలుమీద కాలేసుకూర్చుంటే జీవితం ఎలాగడుస్తుంది?

చక్ర: చేతనైనంత వరకు నలుగురికీ ఉపయోగపడే పనులేవైనా చెయ్యాలని నాకు చాలా ఉబలాటంగా ఉంది.

చంద్ర: చివరికెందుకూ పనిరాకుండా తయారవుతావు. నీ కర్మం నీది. నాకు మాత్రం ఇలాంటి పిచ్చి ఊహాలేం లేవు. నన్ను నేను బాగుచేసుకుంటే సంఘానికి సేవచేసినట్టేనని నమ్మే తరగతివాడిని నేను.

విజయ: బాగా చెప్పారు.

చంద్ర: కనీసం ఓగెజిటెడ్ ఆఫీసర్ కావాలని నా ఆంబిషన్. కాగలగటం, కాలేకపోవటం తరవాత సంగతి.

చక్ర: బాగా డబ్బున్న వాళ్ళందరికీ ఇదే తెగులు - ఇంకా కూడబెట్టాలి, డబ్బు, అధికారం, విలాసజీవితం—మన విజయ గారి ఆశయమేమిటో?

విజయ: నాకీ ఉద్యోగం బాధ ఏమీ లేదుగా. ఆనర్సుప్యాస్ కావటం, ఇంట్లో కూర్చోటం.

చక్ర: అది సరేలెండి, అదేమీ ఆశయం కాదుగా. ఆనర్సు ప్యాసయినట్టే అనుకోవొచ్చు.

విజయ: కాకపోతే కారేసుకు బజారు కెళ్ళటం, కొత్త సిల్కుచీరలేమైనా వొస్తే అందమైందొకటి కొనుక్కొని మళ్ళీ ఇంటికి తిరిగిరావటం - ఇంతకంటె నేను చేసేదేముంటుంది?

చక్ర: మీ ఆంబిషన్?

విజయ: నిజానికి నాకేమీ ఆంబిషన్స్ లేవు. లేకపోతే ఓ వందసిల్కుచీరలూ, ఓవంద సిల్కుజాకెట్లూ సంపాదించటం, నా ఆంబిషననుకోండి, కూ ఆ వరసకి. (నవ్వుతూ)

చక్ర: (విషణ్ణంగా) వంద సిల్కుచీరలూ, వంద సిల్కుజాకెట్లూ...

విజయ: అప్పుడే ఏదో వ్యాఖ్యానం చేస్తున్నారు. సరదాగా మాట్లాడితే మీతో గొప్పచిక్కు.

చక్ర: సరదాగా కాదు. మీ హృదయం విప్పిచెప్పారు. దేశం ఇంత దౌర్భాగ్యస్థితిలో ఉందంటే ఎందుకుండదు? జీవితాలు జీవితంపై దృక్పథాలు ఆశయాలు మానవ మనస్తత్వాలు చాలా విచిత్రమైనవి.

విజయ: నా డబ్బుతో నేను సిల్కు చీరలు కొనటానికీ, దేశం అధోగతిలో

ఉండటానికీ సంబంధం ఏమిటో నా చిన్న బుర్రకి బోధపడటంలేదు.

చక్ర : అయితే మీకు ఎకనమిక్స్‌డిగ్రీ దండగే.

విజయ : డిగ్రీ ఏమిటి, అసలు నాలాంటి వాళ్లు బతకడమే దండగని మా అభిప్రాయ మనుకుంటాను.

చక్ర : క్షమించండి. మీరంతగా గాయపడటం అనవసరం.

చంద్ర : చక్రధర్, మనుషుల హృదయాల్ని సాధ్యమైనంత తీవ్రంగా నిశితంగా బాధించటమే నీ పరమాశయమను కుంటాను. ఈ విద్యలో ఇతోధికమైన సామర్థ్యం సంపాదించగలగటమే నీ ఆంబిషన్ కాబోలు.

చక్ర : కాదు శేఖరం. సిల్కుచీరల నారీమణుల్నీ, గెజిటెడ్ ఆఫీసర్లనీ, ధనధాన్య సమృద్ధిగల భాగ్యవంతుల్నీ జీవితాంతంవరకూ యాచిస్తూ జీవితం గడపటమే నా ఆంబిషన్. వాళ్లముందు నిలబడి చెయ్యి చాపటమే నా వృత్తి.

చంద్ర : ఇవాళ నిన్నేదో ఆవేశించింది.

చక్ర : దౌర్భాగ్యదేవత నన్ను పుట్టినప్పటినుంచీ ఆవేశించింది. భూమిమీద పడ్డప్పటినించీ దరిద్రంగానే బతికాను. అది నేను సహించగలిగాను. కాని తోటి మానవులు దరిద్రంగా బతకటం నేను చూడలేను. ధనవంతుల్ని చూస్తే నాకు కోపంలేదు. కాని వాళ్ళ మనసుల్ని ధనంరూపంలో చెదలుపట్టి పీడించటం నేను సహించను ఆ పురుగులమీద దెబ్బకొట్టే ప్రయత్నంలో మనసులు గాయపడ్డా నేను లెక్కచెయ్యను.

విజయ : మీరు *Inferiority Complex* తో బాధపడుతూ ఇతర్లని బాధించటంద్వారా అది దాచాలని చూస్తున్నారు.

చక్ర : మీరు చెప్పింది నేను ఖండించదలచుకోలేదు. నేను వాదనకోసం వాదించను. అది తీరికగల ధనికులు చెయ్యాలిసిన పని.

(నవ్వులు అరుపులు కొంచెందగ్గరగా వినిపిస్తాయి)

ఒక కంఠం : ఏమోయ్ చక్రధరరావ్, ఎంతవరకొచ్చింది? ఇంకా ఎంతవరకు మాడ్చదలచుకున్నా వేమిటి మమ్మల్ని.

ఇంకొక కంఠం : చూస్తే లెక్చర్లు దంచటంలో నిమగ్నుడైనట్టున్నాడు మనవాడు. ఇవాళ మన నోట్లో కరక్కాయే లే.

(నవ్వులు)

చక్ర : రండి రండి అంతా తలో చెయ్యి వేస్తేగాని పూర్తయేట్టులేదు.

ఒక కంఠం : మరి లేకపోతే పాకం పూర్తిగా చెడేదెలా? ఓ మన రమ కూడా వొస్తున్నారు. గుడ్... (కొద్ది క్షణాలు ఎవరూ మాట్లాడరు) అన్నట్టు మన చక్రధరరావు బాగా పాడతాడుగావును. ఏదీ, పాటపాడుమా చక్రధరా, 'పలుకు తేనెలొలుకునటుల...'

చంద్ర : నీపుణ్యం, వొద్దులే బాబూ, ఏ శ్రామికగీతమో ఆలాపించటం మొదలుపెడితే తేనెసంగతి ఎలాఉన్నా ముళ్లు గుచ్చుకోక మానవు (నవ్వులు)

చక్ర : అలా గుచ్చుకుంటే దేకం ఏనాడో బాగుపడేది.

* * *

(విరామసూచనగా జంత్రసంగీతం. అది క్రమంగా తగ్గిపోయి మద్రాస్ బీచ్‌ని స్ఫురింపచేసే ధ్వనులు)

చంద్ర : ఓ, విజయ! హలో విజయా! కులాసాగా ఉన్నారా?

విజయ : ఎవరు? ఓ చంద్రశేఖరంగారా సూటులో గుర్తుపట్టలేకపోయాను సుమండీ... మీరుకూడా మద్రాసులో నేనా ఏమిటి మకాం?

చంద్ర : ఈమధ్యనే వొచ్చాను. ట్రాన్స్‌ఫర్ అయింది. బహుశా మీకు తెలుసనుకుంటాను. ఇప్పుడు నేను ఇన్‌కంటాక్స్ ఆఫీసర్ని.

విజయ : అవునవును, రమ రాసింది. వీరు నా స్నేహితులు, సిరిపురం జమీందారు శ్రీమంతరావుగారు ఎం. ఏ., వీరు నాక్లాస్‌మేటు చంద్రశేఖరంగారు...

చంద్ర : మిమ్మల్ని కలుసుకోటానికి చాలా సంతోషంగా ఉంది.

శ్రీమంతరావు : థాంక్స్, నాకూ చాలా సంతోషంగా ఉంది.

విజయ : మీరు ఇన్‌కంటాక్స్ ఆఫీసర్ అయారంటే నాకో విషయం జ్ఞాపక మొస్తోంది.

చంద్ర : ఏమిటది?

విజయ : రెండేళ్ళయిందేమో, మనం ఆనర్స్ ఆఖరిసంవత్సరం చదువుతున్నప్పుడు పిక్‌నిక్ ఒకటి చేసుకున్నాం. అప్పుడు మాటలసందర్భంలో గెజిటెడ్ ఆఫీసర్ అవాలని మీ కోరిక అన్నారు. జ్ఞాపకంఉందా?

చంద్ర : (నవ్వి) అవునవును. బాగా జ్ఞాపకంచేశారు. అప్పుడు మీరు కూడా ఏదో అన్నట్టు జ్ఞాపకం (నవ్వుతూ) ఆఁ వంద సిల్కుచీరలూ వంద సిల్కుజాకెట్లూ కదూ? మరి మీ కోరిక ఎంతవరకు నెరవేరిందో?

శ్రీమంత : వంద సిల్కుచీరలూ వంద సిల్కుజాకెట్లూ సంపాదించాలనే కోరికే మన విజయకుంటే అది తప్పకుండా నెరవేరుతుందని నేను గట్టిగా చెప్పగలను. చెప్పటమేమిటి, రేపిపాటికి ఆమె ఇంట్లో అవన్నీ ఉంటాయి

విజయ : నేనేదో తమాషాగా అంటే మీరు నిజమనుకున్నా రేమిటి?

చంద్ర : (వినిపించుకోక) ఓ నాకు తెలిసింది. కంగ్రాచ్యులేషన్స్. విజయా అయితే...

విజయ : (ప్రసంగం మారుస్తూ) మన సంగతి అలా ఉంచండి. చక్రధరరావుగారేంచేస్తున్నారో? నిజంగా ఆయన్ని చూస్తే నాకు చాలా జాలేస్తుంది.

చంద్ర : నాకూ తెలియదు. నేను విశాఖపట్నంలో ఉన్నప్పుడు కొన్నాళ్ళదాకా కనపడేవాడు. కాని తరవాత ఏమయాడో జాడలేదు. ఉద్యోగం చేస్తున్నాడంటే మాత్రం నేను నమ్మను.

విజయ : యూనివర్సిటీలో లెక్చరర్

ఉద్యోగం పిలిచిఇస్తామంటే వొద్దన్నా రట్గా! రమ రాసిందిలెండి ఏదో సందర్భంలో...

చంద్ర: చెప్పానుగా, ఉద్యోగంచేసే లక్షణాలేమీ లేవు వాడిలో...

గోపాల్: (ప్రవేశించి) నమస్కారాలండి. నేను మెట్రిక్యులేషన్ పరీక్షకి చదువుతున్నాను. పరీక్ష ఫీజు కట్టాలి. ఏమైనా సహాయం చెయ్యాలని కోరుతున్నాను.

శ్రీమంత: వెళ్ళవోయ్, గొడవ. ప్రతివాడూ ఇదోటి నేర్చాడు. డబ్బులేకపోతే చదువెవడు వెలిగించమన్నాడు?

గోపాల్: చదువుకోటం మానవుడి జన్మహక్కు. డబ్బు లేకపోతే చదువురాని రోజులివి. దీనికి కారణభూతమైనవాళ్లు, లేనివాళ్ళకి సహాయంచేసి తమ అన్యాయాన్ని సరిదిద్దుకోటం అవసరం. దయచేసి మీ విధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించండి.

శ్రీమంత: పిట్ట కొంచెమయినా కూత ఘనంగా ఉందే...

గోపాల్: నిజం ఎవరు చెప్పినా ఒకటే. ఒక మనిషి ఎంతవరకు చదవదలుచుకుంటే అంతవరకు అతనికి చదువు చెప్పించటం ప్రభుత్వం విధి. మన ప్రభుత్వం అది పట్టించుకోక పోవటంవల్ల ఈ విధి ధనికవర్గంవారిది ప్రస్తుతం. మనిషిని పుట్టుకతోనే అణగదొక్కటం అతి క్రూరమని మీ హృదయాలు చెప్పటం లేదా?



శ్రీమంత: అబ్బో చాలాదాకా ఉందే.. కాని నా హృదయం మాట్లాడటం నేనెప్పుడూ వినలేదోయ్, కుర్రవాడా నాకలాంటి జబ్బేమీ ఇంకా ప్రారంభం కాలేదు.

గోపాల్: హృదయాల మూగభాష వినడానికి సునిశితమైన చెవులుండాలి.

శ్రీమంత: సంతోషించాం, ఇహ దయచెయ్యి.

చంద్ర: అయినా, అదేం అడగటమోయ్? ఏదో బీదవాడినని కొంత జాలి కలిగేట్టు మాట్లాడాలి గాని, అధికారం చలాయిస్తే ఏం లాభం?

గోపాల్: హక్కు ఉన్నచోట ప్రాధేయపూర్వకంగా అడగాలిసిన అవసరమేం లేదండి.

విజయ: అయినా ఇక్కడ దానాలు చెయ్యటానికి డబ్బేవరూ కుప్పలు పోసుకూర్చోలేదు.

గోపాల్: దానాలు చెయ్యడానికి కుప్ప పోసుకోకపోయినా కుప్ప ఉన్నదని తెలిసే వొచ్చాను.

విజయ: ఆఁ సరిగా చక్రధరరావు కూడా ఇలాగే అనేవాడట......

గోపాల్: చక్రధరరావుగారా? వారు మా మాష్టరుగారే.

విజయ: ఏమిటీ?......

గోపాల్: అవునండి. మేమంతా వారిని ఎం. ఎ. మాష్టారంటాం. విశాఖపట్నం కదండి వారిది?

చంద్ర: అవును. అయితే ఇక్కడే ఉంటున్నాడన్నమాట......లెక్చరర్ ఉద్యోగం ఇస్తామంటే వొద్దని ఇక్కడ ట్యూషన్లు చెప్పుకుంటూ బతుకుతున్నాడన్న మాట.

గోపాల్: వారికి చదువు చెప్పినందుకు మేం డబ్బేం ఇవ్వమండి.

చంద్ర: మేం అంటే ఎంతమందేమిటి?

గోపాల్: ఓ నలభైమందిఉంటామండి. రాత్రిళ్లు మాకు పాఠాలు చెబుతారు. పగలు ఎక్కడ తిరుగుతారో మాకు తెలీదు. వారికి కూలిజనం అంతా చెయ్యెత్తి దణ్ణంపెడతారు. మీరు వారిని బాగా ఎరుగుదుర్లే ఉందండి.

చంద్ర: ఓ చీటీ ఇస్తాను. మీ మాష్టారికిస్తావూ?

గోపాల్: (గద్గదికంగా) మా మాష్టారు ఇప్పుడు లేరండి.

చంద్ర: ఏం, ఎక్కడికి వెళ్లారు?

గోపాల్: జైలుకి.

విజయ: }
చంద్ర: } జైలుకా?

గోపాల్: అవునండి.

విజయ: ఎందుకు?

గోపాల్: నాకు సరిగా తెలియదండి. ఫ్యాక్టరీ కూలీలతరఫున అధికారులతో మాట్లాడటాని కెడితే జైల్లో పెట్టారన్నారండి.

విజయ: శేఖరంగారూ, మనిద్దరం మా నాన్నగారితో మాట్లాడి చక్రధరరావుగార్ని వెంటనే విడిపించేట్టు చూద్దాం. పదండి. శ్రీమంతరావుగారూ మీరుకూడా వొస్తారా?

శ్రీమంత: నాకు బజార్లో కొంత పనుంది. కాసేపాగి వొస్తాను. మీరు వెళ్ళండి. ఏ సంగతీ నాకు రేపు కబురుచెయ్యి. పాపం, మీ స్నేహితుడు కష్టంలో ఉన్నందుకు నాకు విచారంగా ఉంది. త్వరగా వెళ్లు.

విజయ: సరే పదండి చంద్రశేఖరంగారూ...

(కారు స్టార్టవుతుంది)

గోపాల్: మా మాష్టారుగార్ని విడిచిపెడతారాండి?

విజయ: ఓ, నీ సంగతి మర్చిపోయాను. ఇంకా వెళ్లిపోయావేమో అనుకున్నాను. ఇదిగో, ఈ డబ్బుతీసుకో.

గోపాల్: నమస్కారం.

(కారుచప్పుడు క్రమంగా దూరమవుతుంది.)

* * *

శ్రీమంతరావు: ఉన్న జమీ కొంతా ప్రభుత్వం లాక్కుంటే మిగిలిన ఆ కొంత డబ్బూ వాళ్ళకీ వీళ్ళకీ పంచిపెట్టమన్నార్ని కూడా జోలె కట్టుకొని మీతో బాటు తిరగమన్నారా?

చక్ర: మీరు జోలెకట్టుకు తిరుగుతుంటే చూడాలని నాకు లేదు. గుడిసెలన్ని తగలబడిపోయి నిలవడానికి నీడలేక బాధపడుతున్న దురదృష్టవంతులకి మీరు చెయ్యగల సహాయం చెయ్యమనిమాత్రమే మిమ్మల్ని యాచిస్తున్నాను.

శ్రీమంత: నే నేమీ ఇవ్వలేనందుకు చింతిస్తున్నాను.

చక్ర: మీ ఇల్లే ప్రమాదానికి గురయిందనుకోండి.

శ్రీమంత: అనుకున్నా ఏమీ ప్రమాదం లేదు. నా ఇల్లు ఇన్స్యూర్ చేశాను.

చక్ర: మీతో వాదించ్యా లాడటానికి నాకు తీరికలేదు. దయచేసి—

శ్రీమంత: దయచేస్తే మీకు కృతజ్ఞణ్ణి.

చక్ర: పేదల జీవితాలంటే ఇంత నిర్లక్ష్యమా శ్రీమంతరావుగారూ? జమీపోయి

నట్టే సిరికూడా పోకముందే మార్పుని గ్రహించి దానిని ఆహ్వానించడానికి ప్రయత్నించి ఉదార హృదయులనిపించుకోండి. సిరి ఎలా వొచ్చిందో అలాగే పోవచ్చు. కాని ప్రజలకి మేలుచేస్తే తరతరాల దాకా మరిచిపోరు. సెలవు...... ఓ! విజయా ఇలా వొచ్చారేం?

విజయ: కూర్చోండి చక్రధరరావు గారూ. నిన్న జైల్లోంచి విడుదలయ్యారో లేదో అప్పుడే భిక్షాటనం బయలుదేరారే!

శ్రీమంత: ఊ! చక్రధరరావుగారంటే మీరేనా? కూర్చోండి, కూర్చోండి. ఆ మాట మొదటే చెబితే బాగుండేదిగా...

చక్ర: ప్రజల అవసరాలదృష్ట్యా కాక వ్యక్తుల మెప్పుకోసం మీరు సహాయం చెయ్యటాని కిష్టపడతారని నాకు తెలియదు.

శ్రీమంత: ఇప్పుడు నేనేమీ ఇస్తాననలేదే...

చక్ర: సరే అయితే సెలవు.

విజయ: నన్నేమీ అడగరేం చక్రధరరావుగారూ?

చక్ర: మీరేమీ ఇవ్వరని నాకు తెలుసు. ఒకసారి జరిగిన అనుభవం నాకు చిరకాలం జ్ఞాపకముంటుంది.

విజయ: ఇచ్చినా ఇవ్వకపోయినా అడగటానికేం?

చక్ర: అనవసరం. మీ సంగతి నాకు బాగా తెలుసు. కొంతమంది మనుషులు అసలు మారలేరు. పుట్టుకతో పుట్టినబుద్ధులు మారటం కష్టం. మీలో ధనికవాదం కరడు కట్టింది.

విజయ: (తిరస్కారంగా) మీరు రశీదు ఇచ్చేట్టయితే నేను డబ్బు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాను.

చక్ర: రశీదా? ఇంతవరకు నే నెవరికి రశీదు లివ్వలేదు. అసలు అచ్చురశీదులు వేయించలేదు.

విజయ: (వ్యంగ్యంగా) అవున్లెండి, రశీదుల గొడవ ఉంటే ఇబ్బందే.

చక్ర: (అనుమానంగా) ఏమిటి మీ ఉద్దేశం? ...నేది?

విజయ: ఏమీలేదు. మీరు చదివింది ఎకనమిక్స్ ఆయె. జమాఖర్చుల బాధ మీరేం పడగలరు? అదో చికాకు పని.

చక్ర: (ఫీలయి) మీరనేది నాకర్థమయింది. ఇంతవరకు ఎవరూ నన్నామాట అనలేదు. డబ్బుకోసమయితే నేను విశాఖపట్నంలో లెక్చరర్‌గిరీలోనే ఉండేవాడిని. అక్రమంగా సంపాదించాలిసిన అవసరం నాకేమీలేదు. (క్రమంగా దగ్గరవుతూ నినాదాలు - రైతు కూలీప్రజా ప్రజారాజ్యం - కావాలి. చక్రధర్రావ్ జిందాబాద్)

విజయ: అని ఎవరన్నారు? (కేకలు దగ్గిరవుతాయి) లెక్చరర్ ఉద్యోగంలో ఉంటే చక్రధరరావ్ జిందాబాద్ అనే నినాదాలు ఎవరుచేస్తారు?

చక్ర: (కోపంతో) వీళ్లకి బుద్ధిలేదు. ఎన్నోసార్లు చెప్పాను. ఆమాట అనొద్దని. ఏం చెయ్యను?

విజయ: మీకు కీర్తి రావటం ఇష్టం లేదని నటించాలిసిన అవసరమేం లేదనుకుంటాను. ఇన్ని కష్టాలుపడటం దానికోసమేగా...

చక్ర: మీకు ఒక విషయం చెప్పి వెడతాను. బూజుపట్టిన భావాలకంటె వంకర భావాలు మహా ప్రమాదకరమైనవి. భావాల బూజు మానవుడి ప్రగతిని మాత్రమే అడ్డగించగలదు. కాని భావాల వంకరతనం అతని దుర్గతికి కారణమవుతుంది. వొస్తా. (నిష్క్రమణ)

విజయ: వంకరభావాలు (అర్ధ స్వగతంగా).

శ్రీమంత: బలేగా దులిపావు విజయా. కుహనా నాయకులంటే ఇలాంటివాళ్ళే. రశీదుల్లేవుట! డబ్బిచ్చి జిందాబాద్ అనిపించుకునే రకం...

విజయ: శ్రీమంతరావుగారూ అతను నా స్నేహితుడు.

శ్రీమంత: (ఆశ్చర్యంగా) ఎస్ ఎస్ సారీ...

విజయ: అతను ఇతర్ల డబ్బు అపహరించడు. డబ్బిచ్చి సొంతడబ్బా వాయించుకునే అవసరమేమీ లేదతనికి.

శ్రీమంత: (అర్థంకాక) కావొచ్చు కావొచ్చు కాని...

విజయ: ఇవాళ నామనసు బావుండలేదు. రేపు వొస్తాను. క్షమించండి.

(నిష్క్రమణ. కొద్దిక్షణాలు నిశ్శబ్దం)

విజయ: ఏయ్ రిక్షా...

రిక్షావాలా: వొస్తున్నానండి ఎక్కండి..

(ఆగి ఆగి రిక్షా గంట చప్పుడు)

విజయ: ఏమోయ్ నువ్వెంత సంపాదిస్తావు రోజుకి.

రిక్షా: ఏదో నాకు సరిపోయేటంత వొస్తుందిలెండి.

విజయ: రిక్షా లాగటంకంటె ఇంకో పనేదైనా చేసుకోకూడదూ?

రిక్షా: చాలాపనులు చేశానండి. రిక్షా లాగటం ఎలాఉంటుందోనని ఈమధ్యే దింట్లో ప్రవేశించాను.

విజయ: ఎలా ఉంది?

రిక్షా: ఎలా ఉందని చెప్పను? శరీర కష్టంచేసే మిగతా అన్నిపనులకి మల్లేనే ఉంది.

విజయ: అవమానకరంగా లేదూ?

రిక్షా: ఎక్కేవాళ్ళకిలేని అవమానం నాకెందుకు?

విజయ: నే నసలు రిక్షా ఎక్కను. తప్పనిసరిగా ఇవాళే ఎక్కాను. రిక్షాలు లాగటం ప్రభుత్వం నిషేధించాలని నా అభిప్రాయం.

రిక్షా: మంచిదే.

విజయ : చదువు నేర్చుకోరాదూ? ఏదైనా ఉద్యోగం చెయ్యొచ్చు.

రిక్షా. చాలామందికంటె నాకు బాగా నే చదువొచ్చు.

విజయ : ఏమిటీ? అన్నట్టు నువ్వు స్వచ్ఛంగా మాట్లాడుతున్నావు. ఎంతవరకు చదివావేమిటి?

రిక్షా : ఎంతవరకు చదివితే ఏం లెండి?

విజయ : చదువుకోటానికి అందరికీ సమానావకాశాలుంటే బావుంటుందికదూ?

రిక్షా : ఎందుకు బావుండదు? అసలు మాబోటి బీదవాళ్లు పైకిరావాలంటే ఇప్పుడున్న ఆర్థిక వ్యవస్థే మారాలి.

విజయ : నువ్వు ఆర్థికశాస్త్రం మాట్లాడుతున్నావే నీపేరేమిటి?

రిక్షా. చక్ చక్రయ్య.

విజయ : (అర్థస్వగతంగా) చక్రయ్య... (కొది క్షణాలు నిశ్శబ్దం)

రిక్షా : ఎక్కడికి పోవాలండి?

విజయ : పోలీసు డెప్యూటీ కమిషనర్ గారింటికి...

రిక్షా : ఆఁ...

విజయ : అవును. ఎందుకంత ఆశ్చర్యం?

రిక్షా : (కంగారుగా) ఎబ్బే – ఏం లేదు...రిక్షా గబగబ పరుగెత్తుతున్న శబ్దం–గంట క్రమంగా దూరమవుతుంది కొన్ని క్షణాలు నిశ్శబ్దం)

* * *

గోపాల్ : నమస్కారాలండి.

విజయ : ఎవరు? నిన్నెక్కడో చూసినట్టు జ్ఞాపకం.

గోపాల్ : నాపేరు గోపాల్ అండి. ఇదివరకు చక్రధరరావుమాష్టారి సంగతి మీకు చెప్పింది నేనేనండి. ఆరోజు మీరు నాకు కొంతడబ్బుకూడా సాయంచేశారు.

విజయ : ఓహో అవును. ఇప్పుడేం కావాలి?

గోపాల్ : నిన్నరాత్రి రిక్షాలో మీరు పదిరూపాయల నోటు పారేసుకున్నారట, ఇదిగో నండి.

విజయ : ఎవరిచ్చారు?

గోపాల్ : ఆ రిక్షా అతనే ఇచ్చాట్టండి.

విజయ : అంటే నీ కియ్యలేదా?

గోపాల్ : లేదండి. మా మాష్టారి కిచ్చాట్ట. వారు నన్ను మీకిచ్చి రమ్మన్నారు.

విజయ : రిక్షావాడు నా కియ్యక మీ మాష్టారి కెందు కిచ్చాడు?

గోపాల్ · ఏమోనండి.

విజయ : అసలు ఈ నోటు నాదేనని అతని కెలా తెలుసు?

గోపాల్ : నిన్నరాత్రి మీదే ఆఖరు బాడుగటండి. మీరు దిగి వెళ్ళిపోయిం తరువాత చూస్తే రిక్షాలో పది రూపాయల నోటు కనిపించిందట...

విజయ : మరి అప్పుడే నాకెందు కియ్యలేదు?

గోపాల్ : ఏమోనండి. నా కెలా తెలుస్తుంది?

విజయ : ముందు జేబులో వేసుకుందామనుకుని తరవాత పోలీసువాళ్ళంటే భయంవేసి మీ మాష్టారిద్వారా పంపించి ఉంటాడు. అంతేనా?

గోపాల్ : ఏమోనండి.

విజయ : సరే ఇహ నువ్వు వెళ్లు.

(విరామసూచనగా జంత్రసంగీతం)

* * *

విజయ : నువ్వా రమా ఏమిటీ వేషం? గెజిటెడ్ ఆఫీసర్ భార్య యేమిటి, ఈ సాదా ముస్తాబేమిటి?

రమ : గెజిటెడ్ ఆఫీసర్ భార్య సామాన్య స్త్రీకంటే ఏ విధంగా గొప్పది?

విజయ : ఏమిటి వింతగా మాట్లాడుతున్నావు?

రమ : పాత ఊహాలూ, పాత భావాలూ ఇప్పుడు వొదిలేశాను, విజయా...

విజయ : ఏమిటో చాలా మారావు. ఈమధ్య బొత్తుగా కనిపించటంలేదు. ఏమిటి అసలు సంగతి?

రమ : నాలుగు నెలలనించీ నేను చక్రధరరావు విద్యాలయంలో పనిచేస్తున్నాను.

విజయ : చక్రధరరావు విద్యాలయంలోనా? గౌరవ ఉపాధ్యాయినివా?

రమ : అవును.

విజయ : అతని ఉపన్యాసాలు బాగా చెవికెక్కాయన్నమాట. శేఖరంగారు ఒప్పుకున్నారా?

రమ : ఆ. ఎందుకొప్పుకోరు? పైగా తీరిక ఉన్నప్పుడు ఆయన కూడా విద్యాలయాని కొచ్చి మంచిచెడ్డలు పరిశీలించి పోతూఉంటారు...అన్నట్టు నేను వొచ్చిన పని మర్చిపోయాను. రేపు మహిళావిద్యాలయం ప్రారంభించబోతున్నాం. రెండువేలు కావాలి. క్షణంలో వసూలుచెయ్యగలనని చక్రధరరావుగారితో చెప్పాను. నా మనసులో నువ్వూ, శ్రీమంతరావుగారూ వున్నారు ఏమంటావు?

విజయ : నన్నడుగుతానని చక్రధరరావుగారితో చెప్పావా?

రమ : ఆఁ.

విజయ : ఏమన్నాడు?

రమ : అయితే వసూలయినట్టే అని వ్యంగ్యంగా అన్నాడు. నేను నువ్వు తప్పక ఇస్తావని పందెం వేశాను.

విజయ : తప్పక ఇస్తాను రమా.

శ్రీమంత : (ప్రవేశించి) ఏమిటి ఇవ్వటం?

(32-వ పేజీ చూడండి)

## స్కెచ్:



ఆకలివేస్తోంది. ఉదయాన కాఫీహోటలు ప్రమొక్కు కూడా చెల్లించుకోలేదని స్మృతికి తెచ్చుకుంటే సరికి బాధ తీవ్రమైంది. భరింపలేకుండా వున్నా. అయ్యారు ఆగ్రహించాడేమో! తలపైకెత్తి చూచాను. గోడ గడియారం కూడా సుముఖంగానే వుంది, ఆకలి తీర్చుకోవడానికి నేను చెయ్యబోయ్యే ప్రయత్నానికి. గడియారం పదకొండుంపావు చూపిస్తోంది.

విధవ ఆవిడ రంగమ్మ, ఆవిడ పుణ్యమా అంటూ అరంపులుపేట ఆరవలైన్లో ఓభోజనహోటలు పెట్టింది. ఆకొన్న ఆంధ్రజీవాలన్నీ అక్కడికే వెడుతుంటాయి; అరవవారి తిండి సరిపడక; ... వేసి నావని నేను చూసుకొనివెళ్ళి పోదామనుకున్నాను. కాని మనసలా చేయనిచ్చింది కాదు వెంటనే ఆతుర్దాగా వెళ్ళాను, 'విశేష' దాహంతో.

"ఏమిటండీ ఇది?"

"ఎవరితను?

"ఎంత సేపటినుంచి యిలా పడివున్నాడు?"

"నీళ్లుపొయ్యాక పోయినారా?"

"చేతిలో 'తాళంచెవి' వుంచారా?"

ఇసకవేస్తే రాలడానికి గూడా సందులేకుండా మూగివున్న జనం మధ్యలో, నోటివెంబడి నురుక్కక్కుతూ పడివున్న ఓ ఆభాగ్యుణ్ణి చూసి, జనంలోని ఓ పెద్దమనిషిని నే నడిగిన ప్రశ్నలివి వాత నాలుక్కరుచుకున్నాను. ఆయన వైఖరిచూసి విస్తుపొయ్యాను.

"అదేవండీ, అలా వళ్ళల్లా కళ్లుచేసుకుంటారు? ఎంతో మర్యాదగా అడిగితే!"

ఆ పెద్దమనిషి నా మాటల్ని యిక లక్ష్యంచెయ్యకండా దృశ్యాన్ని శ్రద్ధతో చూస్తున్నాడు.

దృశ్యంలోని ప్రధాన పాత్రవేపు దృష్టి మరల్చాను. ఎవడు వీడు? ఎవడో పాపం! మూర్ఛపడి వుంటాడు. వాణ్ణి చూస్తే చాలా జాలివయ్యక మానదు. ముఖం కళ తప్పి వుంది. పాలిపోయి వుంది. కండ్లు గజం లోతుకి పీక్కుపొయ్యాయి! పొట్ట అస్తిని అంటుక వుంది. బహుశా ఆకలికి తాళలేక అలా మూర్ఛపడిపోయివుంటాడనుకున్నా.

## "మహాత్మ్యం"

మానం చంపుకోలేక. నూటికి నూరుపాళ్ళు ఆంధ్రుడైన నేను, ప్రత్యేకమైన స్వాజాత్యాభిమానంగల నేను ఆంధ్రరాష్ట్రం రాకపోయినా దానికి చిహ్నంగావుండిపోయిన గోంగూరపచ్చణ్ణి అయినా రోజూ చవిచూచే భాగ్యం కలుగుతుందికదా అని అక్కడికే వెడుతూంటాను.

రోడ్డువెంట వెడుతూన్నాను. భరింపరానంత ఆకలితో బాహ్యాన్నంతా మరచివస్తున్న నేను దారికి అడ్డువచ్చే జట్కావగైరాలను ఎలా తప్పించుకోగలిగానో దురూహ్యం. హోటలువచ్చేసింది. లోపలికి వెళ్ళబోతున్నాను. ఇంతలో ప్రక్కనే రోడ్డుమీద ఓదృశ్యం నన్ను ఆకర్షించింది. కరువుకు వచ్చినంతమంది జనం మూగివున్నారు. "వేలంవెర్రి" అని కొట్టి సార

"చూస్తే తెలియడంలేదూ? కండ్లు లేవూ?"

"ఎవరో? మా చుట్టమా?"

"ఎంతసేపట్నుంచో? నేనూ నీ మాదిరిప్పుడే రావడం."

"తాళంచెవి ఎప్పుడో వుంచారు. నీ విప్పుడు క్రొత్తగా చెప్పే పనిలేదు."

నే నడిగిన ప్రశ్నలకు ఆయన సమాధానాలివి. చూస్తే ప్రతి సమాధానం నన్ను నమిలి మ్రింగేలాగుంది. పైగా ప్రతిదభా కండ్లెర్రచేసుకొని తన చేతివ్రేళ్ళను నా కండ్లలోనికి పోనిస్తూన్నాడు. ఎందుకో ఈయనకింత కోపం! దృశ్యంయెడల తన ఆసక్తికి ఓ ముహూర్తమాత్రం అంతరాయం కలిగించానని కాబోలు! ఇలాంటి గడుసరి ఆయన్ని అసలెంగు కడిగానా అని తగ ఆకలి ఎక్కువైనా కూడా మూర్ఛపోతారు కాబోలు! వెంటనే నా పరిస్థితి తలపుకొచ్చింది. నేను గూడా మూర్ఛపోతానేమో! నాకు గూడా బాగా ఆకలిగా వుందిగా మరి? ఛీ, ఛీ, ఏమిటీ పాడు ఆలోచన? అన్నం లేక మూర్ఛపడిపోయివుండడు వీడు. మరి? ఒకసారి వీధిలోని గోడలమీదికి దృష్టి పోనిచ్చాను.

"తక్కువగా తినండి!"

"బియ్యం తినకండి!"
"కూరగాయలే తినండి!"
"వారంలో ఒకరోజు పస్తుండండి!"
"దుబారా చెయ్యకండి!"
"చేస్తే శిక్షార్హులౌతారు!"

ఈ వాక్యాలు తాటికాయంత అక్షరాల్లో, భీకరంగా, గంభీరంగా గోడమీద అంటించిన కొన్ని కాగితాలమీద రాసున్నాయి. ప్రక్కనే ఓ అస్థిపంజరం వేలెత్తి పై వాక్యాలను చూపిస్తున్నట్టుగా కూడా చిత్రించబడివుంది.

నేను అనుకున్నాను. బహుశా ఈ భీతి గొల్పే అక్షరాలను చూసీ, వేలెత్తిచూపించే బొమ్మను చూసీ మూర్ఛిల్లి వుంటాడేమోనని కొంచెం ఓపికపడితే, ఈ లోపుగా ఆ మనిషి తెలివితెచ్చుకుంటే సంగతేమిటో తెలుసుకోవచ్చుగా? ఎందుకు యింతలోగా నేను 'యిది' గావడం? అనుకున్నా.

'మూర్ఛ' పడినవాడిమీద "వానలు కురియకపోతే శివలింగానికి సహస్ర ఘటాభిషేకం చేసినట్టు", ఏకధారగా, ఏకధాటిగా నీళ్ళు పోస్తున్నారు. నేనుకూడా అలా చేద్దామనుకున్నాను. కాని నేను "కాలేజీ స్టూడెంటు" నన్నమాట స్మృతికివచ్చి ఆ కోరిక చంపుకోక తప్పిందికాదు. ఈ లోపుగా చుట్టూవున్న జనం అంతా జేబుల్లోకి చెయిపోనిస్తున్నారు. నేనెందుకు అనుకున్నాను. ఓ అయిదు నిముషాల్లో నా అనుమానం నివృత్తి అయింది.

"కాని!"
"అర్ధణా!"
"అణా!"
"బేడ!"

మూర్ఛపడిన వాడివేపు హుటాహుటిగ వస్తున్నాయి. ఒక పెద్దమనిషి ఎక్కడా చెల్లని రూపాయికాగితం పడవేసి, అంత బాగుండదేమోనని, ఓ కానీ ధర్మం (!) చేసి మిగతా రూ 0-15-9 రొఖం జేబులో వేసుకున్నాడు! చిత్రగుప్తుడు తన పేరిటి ఖాతాలో ఆ 'కానీ' జమ వేసుకోక పోతాడా అనుకున్నాడు కాబోలు, ఆయన ముఖంపై ఓ విషపునవ్వు తాండవించింది. నేనుకూడా జేబులోకి చెయి పోనిచ్చాను అప్రయత్నంగా. పెరుగు వేయించుకుందామని పట్టుకొచ్చిన రెండణాలూ చేతికి తగిలాయి ఇంతకూ "వాడికా అదృష్టం వుందిలే" అనుకుంటూ ఆ రెండణాలు మూర్ఛవాడివేపు విసిరి పారవేశాను.

ప్రజా దాతృత్వం దాదాపు ఓ అయిదు రూపాయిల దాకాపోయింది. ఇక ఓ పది రోజుల దాకా వాడికి "కూటికి" దిగులు లేదనుకున్నా నా మనస్సు కుదుటబడ్డది. దాంతోపాటు ఆకలి కూడా స్మృతికి వచ్చింది.

హోటలుకు వెళ్లాను. తిన్నాను. విచారించాను పెరుగువేసుకునే అదృష్టం లేనందుకు. బయటపడ్డాను. రూముకు వెడదామనుకున్నాను. కాని యిందాకటి విషయం ఏమయిందేమోనని అలా దృష్టి ప్రసరించాను జనంవేపుకు ఇప్పుడు జనం జాస్తయ్యారు ఇందాకటికన్నా. జనంలోంచి 'దేముడా' అన్న మకుటంతో ఏడుపు వినపడుతోంది. హుటాహుటిగా అక్కడికి వెళ్లాను. సంగతేమిటో తెలుసుకున్నాను.

మూర్ఛవాడు చచ్చిపొయ్యాట్ట!

వాడిభార్య కాబోలు కళావిహీనమైన కళేబరం పైబడి గొల్లునగోడు కుడుస్తున్నది. జుట్టు పీక్కుంటున్నది. గుండె బాదుకుంటున్నది.

"అయ్యో," "పాపం" అన్న అర్థంలేని సానుభూతిమాటల (!) తో ప్రజలంతా గుసగుసలుపోతున్నారు.

ఒకరిద్దరు 'ఊరుకోమ్మా, ఊరుకో, అయ్యో, పాపం, ఆకలిచావా? అంటూ ఊరడించడానికి ప్రయత్నించారు.

మళ్ళా ప్రజల్లోంచి కాన్లూ, అర్ధణాలూ, అణాలూ బేడలు!

ఇదంతా ప్రజలసానుభూతి హృదయాలకు చిహ్నాలు!

కుటుంబానికంతా 'జీవగర్ర' అయిన మనిషి పొయ్యాడని విలపిస్తోంది పాపం ఆ అభాగ్యురాలు!

"రెక్కలు రాని పిల్లల్ని వదలి పెట్టి పొయ్యావా?" అంటున్నది.

"నడిసముద్రంలో తుఫానులో వదలి పెట్టిపోతున్నావా?" అంటూ దుఃఖిస్తున్నది.

ఆవిడ ఒక్కసారి ప్రజలకేసి చూసింది. నీచులు, కఠినహృదయులు, అనుకొని ముఖం దించుకుంది. ఈనిముషాన దాతలు! వెనుకటి నిముషాన హంతకులు! నిజంగా తన భర్తను చంపేసింది ఈకఠోర హృదయులే. పాపం! ఆకలి భరించలేక ఎంతమందిని అడిగుంటాడో ఒక్క కానీ డబ్బివ్వమనీ, ఓపట్టెడన్నం పెట్టమని! కాని ఒక్కరు కూడా పెట్టివుండరు! ఈ నిముషానవున్న దాతలందరూ ఏమయి పొయ్యారో వెనుకటి నిముషానీ? బ్రదికి వుండగా లేని సహాయం, చచ్చింతరువాత వస్తుంది కాబోలు! కొట్లాటంతా అయిపోయింతరువాత కరవేగానవచ్చే పోలీసుదళంలాగ! ఎందుకు తన కిప్పుడు ప్రజలిచ్చేడబ్బంతా? తలకొట్టివేసిం తరువాత దుస్తులివ్వబోవడం దేనికి?

అసలు తనభర్తకు 'మూర్ఛ' అని ఎవరూ తేల్చిందీ? ప్రజలేనా? మూఢులు! ఆకలితో సొమ్మసిల్లిపడ్డాడు కాబోలు! అది మూర్ఛ అవుతుందా? ఔను ప్రజలదృష్టిలో అంతే!

ఆకలితో స్మృతి తప్పిపోవడం...... "మూర్ఛ!" జబ్బు!!

"ఆకలి చావు"......"సమాధి!"

అందరితో బాటు నేనూ రెండశ్రుబిందువులు రాల్చాను. పేదాడి ఆత్మకు శాంతినీయవలసిందిగా భగవంతుణ్ణి ప్రార్థించాను. రూముకు వెళ్ళాను విచారంతో.

తెల్లవారింది. పత్రిక వచ్చింది. పూజలు చెక్కిన దీర్ఘ చతురశ్రంలో "అరండలుపేట ఆరవ లైన్లో ఆకలిచా"వన్న వార్త తాటికాయంత అక్షరాల్లో వేసుంది.

పదిరోజులు గడిచినట్టు క్యాలెండరు చూపెట్టింది.

ఉదయం 'పత్రిక' వచ్చింది. అందులో చూచాను. "అరండలుపేట ఆరవ లైన్లో ఆకలిచావన్న వార్త నిరాధార"మని ప్రభుత్వ ప్రకటన వుంది.

సినిమాలో క్లోజప్ యిచ్చినలాగా ఆనాటి దృశ్యం నాకళ్ళకు కట్టినట్లైంది.

రంగమ్మ భోజన హోటలు!...శవం.... జనం!

స్వయంగా ఆ దృశ్యాన్ని చూచిన నా కళ్లు ప్రభుత్వానికి కండ్లు లేవన్నాయ్.

స్వయంగా చావుకు గురైన వాడి భార్య యేడ్పును విన్న నా చెవులు ప్రభుత్వానికి చెవులు లేవన్నాయి.

ఈ రోజుకూ అలాగే అంటున్నాయి.★

# బొమ్మరిల్లు



## ★ తిక్కలవాడు ★

★

"రవి"

తక్కాల పాడను గ్రామములో
తిక్కాల వాడొకడున్నాడు.
తిక్కాలవానికి ఆస్తంటూ
బక్క గుఱ్ఱమొక టేడ్చింది.

నీళ్లూ మేతా పెట్టకనే
ఊళ్లవెంబడే త్రిప్పటచే,
త్రాళ్లు త్రెంచుకొని ఒకనాడు
కాళ్లకు బుద్ధిని చెప్పింది.

కట్టుగొయ్యకాడ గుఱ్ఱాన్ని
కానక ఆతడు కంగారై,
కఱ్ఱాచెప్పులు తీసుకొని
గుఱ్ఱాన్ని వెదకగ కదిలాడు.

ఎంత వెదకినా సుంతైనా
అంతుదొరక లేదాతనికి
అసురుసురంటూ వస్తూనే
ఆలినిచూచీ నవ్వాడు.

"ఎందులకట్లా నవ్వేదరూ?
ఇంతకు గుఱ్ఱము దొరికిందా?"
అంటూ ఆతని పెండ్లాము
ఆత్రముతోడను అడిగింది.

"పాడుగుఱ్ఱమూ పోతేపోనీ
ప్రాణాలైనా దక్కినవి.
దేవుడుచాలా మంచోడే,
దీనజనుల సంరక్షిస్తాడే

ఎప్పటి మాస్తరుగాదాన్ని
ఎక్కేవున్నట్లయి తేను
యింతకు దానితో పాటుగనే
ఏమైవుందునో నేనూను."

---

# ★ పక్షులు ★




గుడ్లగూబ

పిల్లలకు భయం కలిగించే పక్షుల్లో గుడ్లగూబ ఒకటి. దీని ఆకారం పైశాచికంగా వుంటుంది. కళ్లు పసుప్పచ్చగా వుండి తీక్ష్ణంగా రెప్పలు వాల్చకుండా చూస్తూంటాయి. వంటిమీద తెల్లటి మచ్చలుంటాయి. గుడ్లగూబ సాధారణంగా రాత్రిళ్లే విహరిస్తుంది. అడవుల్లోను, ఊళ్ల బయట చెట్లమీదను నివసిస్తుంది. ఊళ్లో సామాన్యంగా కనిపించదు. కాని నిర్భయంగా, మనిషి అంటే లెక్కలేనట్టు సంచరిస్తుంది. చింత, రావి, మామిడి, జువ్వి, మర్రి మొదలైన ఎత్తైన చెట్లంటే దీనికిష్టం. ఇది రాత్రిళ్లెక్కువగా తిరగటానికి కారణం సూర్యరశ్మి అంటే ఇష్టం లేక కాదు. మధ్యాహ్నం పూట కూడా గుడ్లగూబ ఆహారంకోసం తిరుగుతూ వుంటం చూడచ్చు. అయినా ఇది కంటబడిందంటే చాలు మిగతా పక్షులు దీన్ని తరిమి తరిమి కొడతాయి. అంచేత పగలాట్టే కనిపించదు. చిన్న చిన్న పురుగుల మొదలు బల్లులు, చుంచుల వరకూ చాలా ప్రాణులను భక్షిస్తుంది. దీని అరుపు వికృతంగా, భయంకరంగా ఉంటుంది. నవంబరు, ఏప్రిల్ నెలలమధ్య గుడ్లు పెడుతుంది. పాడుపడ్డ ఇళ్లలోను, చెట్టుతొర్రల్లోను తడవకు మూడు నాలుగేసి గుడ్లు చొప్పున పెడుతుంది.

## పావురం.

పెంచటానికి తేలికైన పక్షుల్లో పావురం ఒకటి. అడవి పావురాలు అడవుల్లో కంటే రాతికొండలమీద, కొండ శిఖరాల మీద ఎక్కువగా నివసిస్తాయి. కాని కొన్ని రకాల పావురాలు నిర్జన స్థలాల్నికంటే, పట్టణాలను, పల్లెలనే ఎక్కువ ప్రేమిస్తాయి. కిక్కిరిసిన బజార్లకు, రొదకు, రొచ్చుకూ ఇవి అలవాటయి పోతాయి. ఇళ్ళలోకి నిర్భయంగావచ్చి గూళ్లు కట్టుకుంటాయి. ఫ్యాక్టరీలు, రైల్వేస్టేషన్లు అంటే వీటికి బాగా ఇష్టంలా కనిపిస్తుంది. ఒక్కొక్కసారి ఇవి

(36-వ పేజీ చూడండి)




పావురము

# ★ రూసో ★

చెల్లీ,

నీ ఉత్తరం అందింది. గొప్పవాడంటే ఎల్లాంటివాడని అడుగుతూ రాశావు. ప్రపంచ చరిత్రలో అనేకమంది గొప్పవాళ్లున్నారు. కాని అందరూ అన్ని విషయాల్లోను గొప్పవాళ్లు కారు. ఒక్కొక్కరికి ఒక్కొక్క విషయంలో గొప్పదనం వుంటుంది. గాంధీగార్నే తీసుకో. ఆయన మనదేశానికి స్వాతంత్ర్యం సాధించడానికి పోరాటం నడిపాడు. కాని ఆయనకి త్యాగరాజుకుమల్లే సంగీతం రాదు; కాళిదాసుకి మల్లే కవిత్వం రాదు. అల్లాగే త్యాగరాజు, కాళిదాసులకు గాంధీగారి మల్లే ప్రజలకు నాయకత్వం వహించి పోరాటాలు నడిపే శక్తి లేదు. ఇల్లా ఒక్కొక్కరిలో ఒక్కొక్క విధంగా గొప్పదనం వికసిస్తుంది. అంతే కాదు. గొప్పవాడని పిలవబడేవాడు సర్వసద్గుణసంపన్నుడు కూడా కానక్కరలేదు. తాగుబోతు కావచ్చు, వ్యభిచారి కావచ్చు, అబద్ధాలకోరు కావచ్చు. అయినా ఏ సంగీతమో పాడి వినేవాళ్ల హృదయాల్లో రసప్రవాహాలను ఉప్పొంగించవచ్చు. లేక గొప్ప కవిత్వం రాసి ప్రజల్ని ఉద్రేకింపజెయ్యవచ్చు.




ఇప్పుడు చెబుతాను విను, గొప్పవాడంటే ఎల్లాంటివాడో. ప్రపంచ చరిత్ర ఎప్పటికప్పుడు ముందుకు పోతూవుంటుంది కాని ఒకచోట నిలవదు. ఏ జాతి చరిత్ర అయినా అభివృద్ధి కాకుండా నిలిచిపోయిందీ అంటే, ఆజాతి అప్పటికి సంబంధించినంతవరకూ చచ్చిపోయిందన్నమాటే. అందుచేత ఒకజాతి ఏ విషయంలోనైనా సరే, సైన్సులోగాని, సంగీతంలోగాని, కవిత్వంలో గాని, రాజకీయాల్లోగాని, ఎల్లాగైనాసరే, అభివృద్ధి కావటానికి ఎక్కువగా పాటుబడినవాడుంటాడే, వాణ్ణే గొప్పవాడుగా ఎంచుతాం. అల్లాంటి వాడే గాంధీ. అల్లాంటి వాళ్లే త్యాగరాజు, కాళిదాసులు.

అల్లాంటివాడే అయిన రూసో అనే ఆయన్ని గూర్చి ఈసారి చెబుతాను. ఈయన యూరప్ ఖండంలో వున్న ఫ్రాన్సు దేశంలో 1712 వ సంవత్సరంలో పుట్టాడు. తండ్రి

చిన్న గడియారాలషాపు యజమాని. తల్లి చిన్నప్పుడే చనిపోయింది. రూసో చిన్నప్పటినుంచీ పుస్తకాలు తెగ చదివేవాడు. అతని తెలివితేటలు అసాధారణమని చిన్నప్పటినుంచే అంతా గ్రహించారు. అయితే నేం, రూసోలో మనిషికెన్ని దుర్గుణా లుంటానికి వీలుందో అన్నీ వున్నాయి. చిన్న చిన్న దొంగతనాలు, అలవాటు చేసుకున్నాడు. అడ్డమైన అబద్ధాలు ఆడేవాడు. ఎంతో ఆదరించే స్నేహితులతో కూడా పోట్లాడేవాడు. వ్యభిచారం చేసేవాడు. రౌడీగా తిరిగేవాడు. ఈ గుణాలు అతన్ని చివరివరకూ విడవలేదు. చివరి రోజులలో అతడు తను చిన్నప్పటినుంచీ చేసిన వెధవపనులన్నిటికీ పశ్చాత్తాప పడుతూ ఒక పుస్తకం రాశాడు. ఆ పుస్తకం గొప్ప పుస్తకాల్లో ఒకటిగా అన్ని దేశాల వాళ్లూ భావిస్తారు. కాని ఆ పుస్తకంలోకూడా అతడు చాలా అబద్ధాలు రాశాడు.

రూసో మనిషి ఇల్లాంటివాడయినా అతన్ని చరిత్రకారులు గొప్పవాడని ఎందు కంటారు? అతని దుర్గుణాలన్నీ మెచ్చుకోదగినవని కాదు. వాటిని గర్హించాల్సిందే. అందరూ గర్హించారు కూడాను. కాని రూసో చేసిన గొప్పపని ఏమిటంటే కొన్ని పుస్తకాలు రాశాడు. ఆ పుస్తకాలు ఫ్రాన్సు దేశ చరిత్రను పూర్తిగా మార్చెయ్యటానికి తోడ్పడ్డాయి.

రూసో కాలంలో ఫ్రాన్సు దేశాన్ని రాజులు పరిపాలిస్తూ

(37-వ పేజీ చూడండి)

# హకల్ బెరీ ఫిన్

## మార్క్ ట్వేన్

బొమ్మరిల్లు సీరియల్

## 5

హఠాత్తుగా మానాన్నను చూసేసరికి జడుసుకున్నాను. ఏమీ లేదనుకున్న చోట అకస్మాత్తుగా ఎలికపిల్ల కనిపించినా జడుసుకోవటం సహజం. అందులో ఇన్నాళ్లూ కనిపించకుండా తిరిగిన మా నాన్నలాంటి రాక్షసుడు కనిపిస్తే ప్రాణాలు పైనే ఎగిరిపోవటంలో ఆశ్చర్యమేముంది? కాని ఒకటి రెండు నిమిషాల్లో భయం తగ్గి గుండెలు సద్దుకున్నాయి. వాణ్ణిచూసి అంత భయపడే అవసరం లేదనుకున్నాను.

మానాన్నకు యాభై ఏళ్లుంటాయి; ఉన్నట్టు మనిషిని చూస్తేనే చెప్పచ్చు. జుట్టు పొడుగ్గా పెరిగి, చిక్కుపడి బుజాలదాకా వస్తోంది. గడ్డంకూడా దుబ్బుగా పెరిగింది. జుట్టు, మీసాలు, గడ్డం అన్నీ రాగితో చేసినట్టున్నాయి. ఈ వెంట్రుకల గుబురులోంచి అక్కడక్కడ మొహం కనిపిస్తోంది. ఆ మొహం తెల్లగావుంది. అందరిమాదిరి తెలుపుకాదు అదో విచిత్రమైన తెలుపు; ఎదటివాడి నెత్తురు గడ్డ కట్టించే తెలుపు; ఎదటివాడి కాళ్లు జివ్వున లాక్కుపోయేట్టు చేసే తెలుపు. ఇక గుడ్డలున్నాయి—వాటిని గుడ్డలనటం గుడ్డలికికూడా అవమానకరం. కాలుమీద కాలేసుకుని కూర్చున్నాడు. బూట్లు దుమ్ముకొట్టుకుని ఎర్రగా వున్నాయి. వాటిలోంచి రెండుమూడు వేళ్లు తొంగి చూస్తున్నాయి. వాడిటోపీ నేలమీద వుంది. అదికూడా తూట్లుపడి దుమ్ము కొట్టుకుని వుంది.

వాడికేసి చూస్తూ నుంచున్నాను. వాడూ నాకేసి అలాగే చూస్తున్నాడు, కుర్చీలో వెనక్కీ ముందుకీ వూగుతూ. దొడ్డివేపు కిటికీ తెరవబడి వుంది. అంటే ఇంట్లోవాళ్లకి తెలియకుండా దొడ్డిదారిన వచ్చాడన్నమాట. నెమ్మదిగా సంభాషణ ప్రారంభించాడు.

"ఇస్త్రీబట్టలు తొడుక్కున్నావే. బలే. ఇప్పుడు నీఅంత గొప్పవాడు లేడనుకుంటున్నావు కదూ?"

"అనుకోవచ్చు. అనుకోకపోవచ్చు" అన్నాను.

"ఛప్. నీ జవాబులు నాకక్కర్లేదు. నేను లేనప్పుడు చాలా గొప్పపనులు చేశావుట. అదేమిటో కనుక్కుందామని వచ్చా. చదువుకుంటున్నావు కదూ. రాయటం, చదవటంకూడా నేర్చావని చెప్పార్లే. అదేమిటో చూస్తా. నాకు చదువురాదని నాకంటే గొప్పవాణ్ణనుకుంటున్నావు కదూ. చూస్తా, చూస్తా. ఈ వెధవపనులన్నీ చెయ్యమని ఎవరు చెప్పారు నీకు?"

"డగ్లస్ అమ్మగారు చెప్పింది"

"అమ్మగారా? ఆవిడకి సంబంధంలేని విషయాల్లో వేలుపెట్టమని ఆవిడ కెవరు చెప్పారు?"

"ఎవరూ చెప్పలేదు."

"నేను చెబుతానాగు, ఏ విషయాల్లో వేలు పెట్టచ్చో, పెట్టగూడదో. ఇదిగో విను. రేపటినుంచీ బడి మానేయ్. నీ అబ్బకంటే గొప్పవాణ్ణవుదామను కున్నావా? రేపణ్ణించి బడి చుట్టుపక్కల కనిపించా వంటే తాట వొలుస్తా. నీ అమ్మకి చదువురాదు. మన కుటుంబంలో ఎవళ్లకీ బతికుండగా చదవటం, రాయటం గాదు. ఇహ నువ్వొక్కడివే నేర్చుకుందా మని ఎత్తేశావేం? జాగర్త. ఏదీ ఏమాత్రం వచ్చో చూస్తాను, చదువు."

అలమారలోంచి ఒక పుస్తకం తీసి జనరల్ వాషింగ్టన్‌గూర్చి చదవసాగాను. రెండు మూడు వాక్యాలు చదివాను. మానాన్న కోపం పట్టలేక పుస్తకం లాక్కుని కిటికీలోంచి విసిరి పారేశాడు.

"నిజమే నన్నమాట. మొదట్లో వాళ్లు చెబితే నమ్మలేదు. ఓరి నీదుంపతెగా, నిన్ను నిలువునా నరికెయ్యా, నీ కిదేం పొయ్యేకాలంరా. నాకళ్లఎదట, నా సొంతకొడుకు పుస్తకం చదువుతుంటే చూస్తూ వూరుకునేదా? ఇదిగో మళ్ళీ చెబుతున్నా. బడి చాయల్లో కనిపించావంటే నరికేస్తా."

గది నాలుగుమూలలా పరీక్షగా చూశాడు. నిట్టూర్పు విడిచి,

"చాలా దర్జాగాబతుకుతున్నావే. ఒక మంచం, పరుపు, తెల్లటి దుప్పట్లు, అద్దం, తివాసీ---అబ్బో, ఏం దర్జా, ఏందర్జా. నీఅబ్బ మాత్రం గొడ్ల దొడ్లలో రొచ్చులో దొర్లాలేం? ఆహాహా! ఏం న్యాయం, ఏం కొడుకు! ఓరి నిన్ను పాతెయ్యా. నే నింకా బతికుండ గానేన్రటా ఈఘోరం? అన్నట్టు నీకు చాలా డబ్బుం దని చెప్పారు. ఎక్కడినీ?"

"అంతా అబద్ధం."

"నాదగ్గిర నీఆటలు సాగవు. నాకోపం వచ్చిం దంటే మనిషినికాను. నేను ఊళ్లోకి వచ్చి రెండు రోజు లైంది. ఈరెండు రోజుల్లో నీడబ్బునుగురించి తప్ప ఇంకోమాట వినలేదు. ఈవూళ్లోనే గాదు, చుట్టు పక్కల ఊళ్లలోకూడా ఇదేమాట. తెలిసిందా. అన లందుకే మళ్ళీ వచ్చా నిక్కడికి. రేపు ఆడబ్బు తెచ్చియ్యి. నా క్కావాలి."

"నాదగ్గిర డబ్బులేదు."

"నీదగ్గిర కాకపోతే జడ్జిథాచర్ దగ్గరుంది, నాకేమైనా సరే రేపటికల్లా డబ్బు తెచ్చివ్వాలి."

"నాదగ్గిర లేదంటే వినవేం? జడ్జీగార్ని కూడా అడుగు నిజమోకాదో."

"సరే. ఆయన్నే అడుగుతాను. ఆయనచేత అంతడబ్బూ కక్కించి తీరతాను. ఇప్పుడు నీజేబులో ఎంతుంది? నాక్కావాలి."

"ఒకడాలరుంది. దాంతో నేను---"

"ఊహు. అదేమీ పనికిరాదు మనదగ్గిర. ఇటు కక్కు ఆ డాలర్."

డాలర్ తీసి ఇచ్చాను. కొరికి చూశాడు అది మంచిదో, నత్తుదో చూడ్డానికి. అవ్వాళల్లా విస్కీ తాగలేడుట. అందుచేత వెంటనే పోయి గుక్కెడు విస్కీ దాహం పుచ్చుకుంటా నన్నాడు. కిటికీలోంచి మాకి అవతలికి పోయాడు. మళ్ళీ వెనక్కివచ్చి తొంగి చూసి, తనకంటే గొప్పవాణ్ణనుకుంటున్నందుకు నన్ను తిట్టిపోయాడు. వెళ్లిపోయాడుగదా అనుకుంటే మళ్లీ వెనక్కివచ్చి "బడిదగ్గిర రేపు కాచు క్కూచుం టాను. ఆ దగ్గర్లో కనిపిస్తే చర్మం వొలిచేస్తా" నన్నాడు.

ఆమర్నాడు మానాన్న చిత్తుగా తాగాడు. జడ్జి థాచర్ గారిదగ్గిరికి పోయి నాతాలూకు డబ్బు ఇవ్వమని కబాయించాడు. కాని జడ్జీగారు ఒప్పుకో లేదు. కేసుపెడతా నన్నాడు మానాన్న.

జడ్జి థాచర్‌గారు, అమ్మగారు నన్ను మా నాన్ననుండి విడిపించి తమలోఒకరి సంరక్షణకింద ఉంచటానికి ప్రయత్నించారు. కాని కోర్టులో అప్పుడే కొత్తగా ఒకజడ్జి నియమించబడ్డాడు. ఆయనకి మా నాన్ననుగూర్చి ఏమీ తెలియదు. అందుచేత కేసు మానాన్నపక్షానే ఖాయమైంది. తండ్రిదగ్గర్నుంచి కొడుకును విడదీయటం న్యాయచట్టం వొప్పుకోదనీ, అందుచేత కుర్రాణ్ణి తండ్రి సంరక్షణకే అప్పగించాలనీ తీర్పుచెప్పారు. జడ్జిథాచర్, అమ్మగారు తమ ప్రయ త్నాలు మానుకోవలసి వచ్చింది.

కేసు గెలిచినందుకు మానాన్న సంతోషంతో గంతులు వేశాడు. తనకి డబ్బుతెచ్చియివ్వకపోతే పీక నులిమేస్తానని నన్ను బెదిరించాడు. థాచర్‌గారి దగ్గి రికిపోయి మూడుడాలర్లు బదులుతెచ్చాను. మానాన్న అది పుచ్చుకుని విస్కీ కొన్నాడు. సీసా పుచ్చుకుని

రోజంతా వీధుల్లో తిరుగుతూ, తాగుతూ, వాగుతూ గడిపాడు. వాడిగోల భరించలేక పోలీసులు వాణ్ణి అరెస్టుచేసి జైల్లోపెట్టారు. మర్నాడు కోర్టువారు విచారణచేసి వారంరోజులు ఖైదువేశారు. కాని మానాన్న లెక్క చెయ్యలేదు. తనకొడుకు తనకింద వున్నంత కాలం తనకేం ఫరవాలేదన్నాడు.

ఖైదులోంచి విడుదల అయ్యాక మానాన్నని కొత్త జడ్జిగారు తమఇంటికి తీసుకుపోయారు. వాణ్ని కొత్తమనిషిని చేస్తాననీ, పైకి తీసుకొస్తాననీ అన్నారు. స్నానం చేయించి, తలకి నూనెరాయించి, కొత్త బట్టలు తొడిగించి, తమపక్కన భోజనానికి కూర్చోపెట్టుకుని మర్యాదచేశారు. భోజనమైన తర్వాత జడ్జిగారు మానాన్నని ఒక గదిలోకి తీసుకుపోయి ఉపదేశంలాంటి దేదో చేశారు. తాగుడువల్ల మనిషి ఎలా చెడిపోతాడో, దానివల్ల వచ్చేనష్టాలేమిటో వివరంగా చెప్పారు. జడ్జిగారి ఉపన్యాసం విని మానాన్న తను నరకలోకంలో పడబోయే బాధలన్నీ తలుచుకుని బావురుమని ఏడ్చాడు. ఇంకెప్పుడూ పాపపు పనులు చెయ్యననీ, బుద్ధి వచ్చిందనీ, ఇకముందు తన జీవిత చరిత్రలో కొత్త అధ్యాయం ప్రారంభిస్తాననీ చెప్పాడు. మానాన్న పొందిన పశ్చాత్తాపంచూసి కొత్త జడ్జిగారు కూడా బావురుమని ఏడ్చాడు. ఆయన్నిచూసి ఆయన భార్య బావురుమంది. మానాన్న తను నిజంగా మంచి వాణ్ణేననీ, జనం తన్నుసరిగా అర్థం చేసుకోలేదనీ అన్నాడు. జడ్జిగారు ఆమాట నమ్ముతున్నా నన్నాడు. మానాన్న మనిషికి కావలసిందల్లా సోదర ప్రజల సానుభూతియేననీ, అది లేకపోతే మనిషి అయినవాడు బతకటం కష్టమనీ అన్నాడు. జడ్జిగారు అవునన్నాడు. అందుచేత మళ్ళీ అంతాకలిసి ఒకళ్లమీద ఒకళ్లు సానుభూతికోసం ఏడ్చారు. అప్పటికి రాత్రి చాలా పొద్దు

పోయింది. మానాన్న లేచి నుంచున్నాడు. చెయ్యి జాచి,

"సోదర సోదరీ మణులారా! ఇదిగో ఈ చెయ్యి ఒక లుచ్ఛాది. కాని ఇకమీదట అదిఒక పుణ్యాత్ముడి దౌతుంది; ఆ పుణ్యాత్ముడు రేపు పొద్దుటినుంచీ కొత్త జీవితం ప్రారంభించ బోతున్నాడు. జాగ్రత్తగా వినండి యీమాటలు. ఈ చెయ్యి ఇప్పుడు పవిత్రమైంది. రండి నా చెయ్యి అందుకోండి. భయపడకండి," అన్నాడు.

జడ్జీగారు, ఆయనకుటుంబం ఒకరి తరవాత ఒకరు మానాన్న కరస్పర్శ చేశారు. తరవాత జడ్జీగారు ఒక ప్రమాణపత్రం తయారుచేశారు. మానాన్న దానిమీద వేలిముద్ర వేశాడు. తరవాత మానాన్నకు ఒక గదియిచ్చి, అందులో పడుకోమన్నారు.

ఒక రాత్రివేళ మానాన్నకు బాగా దాహం వేసింది. కిటికీలోంచి చడీ చప్పుడూ కాకుండా దూకి బజారున పడ్డాడు. జడ్జీగారిచ్చిన కొత్తకోటు అమ్మేసి ఒక పెద్ద కూజానిండా విస్కీ కొనుక్కుని మళ్లీ గది లోకి వచ్చేశాడు. కూజా ఖాళీఅయ్యాక మళ్ళీ బయటికి వచ్చాడు. ఎక్కడికి పోతోందీ, ఏం చేస్తోందీ తెలియక తూల్తూ పోయిపోయి ఒక మురికిగుంటలో పడ్డాడు. తెల్లారాక ఎవరో దారిన పోయేవాళ్లు లేవదీశారు.

ఈ సంగతంతా కొత్త జడ్జీగారు విని విచారంగా మొహంపెట్టి "వాణ్ణి బాగుచెయ్యాలంటే తుపాకీ ఒక్కటే పనికొస్తుంది; ఇంకేవిధంగానూ వాడు బాగుపడడు," అన్నారు.

## 6

మళ్లీ మానాన్న కోర్టులో కేసుపెట్టాడు జడ్జి థాచర్‌గారి మీద. నాడబ్బు నెల్లాగైనా జడ్జిగారినుండి లాగెయ్యాలని వాడిఎత్తు. కాని కేసును కోర్టువారు ఎన్నిరోజులైనా వాయిదావేస్తూ వచ్చారుగాని ఎన్నాళ్లకీ విచారణ చెయ్యలేదు. ఈలోగా మానాన్న పోరు పడలేక నేను రోజుపడిచి రోజు థాచర్ గారి దగ్గిరికివెళ్లి రెండు మూడు డాలర్లు తెచ్చియిచ్చేవాణ్ణి. అదిగాక నన్ను బడికిపోకుండా అడ్డగించేవాడు. అయినా నేను వాడి కన్నుమరిగించి ప్రతిరోజూ బడికి పోయేవాణ్ణి. అదివరదాకా నాకు బడిమీద మోజు లేదు. కాని మానాన్న వద్దన్నాక బడిఅంటే ఎక్కడలేని భక్తిపుట్టింది. మానాన్న నేడిపించాలని విధిగా బడికి వెళ్లేవాణ్ణి.

నేనిచ్చిన డబ్బుతో మానాన్న పూటుగా తాగి బజార్లలో గోలచేసేవాడు. గోల చేసినప్పుడల్లా జైల్లో పెట్టేవారు. కొన్నాళ్లు జైల్లో, కొన్నాళ్లుఊళ్లో, ఈ జీవితం మానాన్నకు పరిపాటి అయింది.

నేను ఎక్కువగా అమ్మగారింట్లోనే దాక్కోవటంచేత నన్ను తన్నటానికి అవకాశం దొరికేది కాదు. అందుకని మానాన్న పంజరంలో చిలకకోసం పిల్లి తిరిగినట్టు ఎప్పుడూ అమ్మగారింటి చుట్టూ పొంచి పొంచి తిరిగేవాడు. ఇదిచూసి అమ్మగారు వాణ్ని జైల్లో పెట్టిస్తానని బెదిరించేది. ఒకసారి నేను బడినుంచి తిరిగి వస్తుండగా మానాన్న దారికాసి, మీదపడి అడవిలోకి ఎత్తుకుపోయాడు. అక్కణ్ణించి పడవలో కెక్కించి నది ఎగువకు మూడుమైళ్లు, అక్కణ్ణించి అవతలి ఒడ్డుకు తీసుకపోయాడు. అవతలి ఒడ్డునించి ఇల్లినాయిస్ రాష్ట్రం ప్రారంభమవుతుంది. అక్కడ నిర్జనమైన, దట్టమైన అరణ్యం ఉన్నది. అరణ్యం మధ్య ఒక పూరిపాక వుంది. ఆపాకలో నేను, మానాన్న నివాసం ప్రారంభించాము.

మానాన్న నామీద ఎప్పుడూ ఒక కన్ను వేసే వుంచేవాడు. పారిపోవటానికి వీలు చిక్కనేలేదు. రాత్రిళ్లు పడుకోబోయేటప్పుడు తలుపులోపల గొళ్లెం పెట్టి తాళంవేసి తాళంచెవి తలకింద పెట్టుకునేవాడు. ఎక్కడో దొంగిలించిన తుపాకి ఒకటి దగ్గిరుంచుకునేవాడు. దాంతో అడవిలో పిట్టలు కొట్టేవాడు. నేను చేపలు పట్టేవాణ్ణి. పిట్టలు, చేపలు ఇవే మా ఆహారం. రోజూ ఒకసారి తలుపుబైట తాళంవేసి కొట్టినపిట్టలు, పట్టినచేపలు పుచ్చుకుని పడవలో అవతలిఒడ్డుకి పోయి అక్కడ రేవుదగ్గిర అవి అమ్మి, ఆడబ్బుతో విస్కీ కొనేవాడు. మళ్ళీ ఇంటికొచ్చి విస్కీ తాగి, మత్తెక్కి నన్ను బాదేవాడు. కొన్నాళ్లకి నేను ఫలానాచోట వున్నట్టు అమ్మగారికి తెలిసింది. నన్ను తీసుకు రమ్మని ఒక మనిషిని పంపింది. కాని మానాన్న తుపాకిచూపి బెదిరించి వాణ్ణి తరిమేశాడు. ఇంకా కొన్నాళ్లయ్యేసరికి నేను యథాప్రకారంగా ఈ జీవితానికి—మా

(38-వ పేజీ చూడండి)

# ఉదారుడైన మొదలియారు

తంజావూర్ దగ్గర ఒక గ్రామములో ఒక మొదలియార్ నివసించుతూ వుండేవాడు. ఆయన చాలా ధనవంతుడేగాక మంచి వాడుకూడా. ఎప్పుడూ ఆయన బీదలకు సహాయంచేస్తూ వుండేవాడు. ఎవరైనాగాని ఆయనదగ్గరకువచ్చి వట్టిచేతులతో పోయే వాళ్లుకాదు. ఆ గ్రామందగ్గరగానే హరిజనవాడ వుంది. అందులో చాలామంది హరిజనులు నివసించుతూ వుండేవారు. ఏజాతి వాళ్లైనాగాని హరిజనులని వాళ్ళ గ్రామంలోకి రానిచ్చేవారుకాదు. వాళ్లు ఎవరినైనా అంటుకుంటే పెద్ద తప్పుగా భావించేవారు. ఆ హరిజనవాడలో నందన్ అనే ఒక హరిజనుడు వున్నాడు. ఒకసారి ఎందుకో రాజుగారికి నందన్ మీద కోపంవచ్చి నందన్‌ని పట్టుకురావడానికి తన సిపాయిలను పంపాడు. అమాయికుడైన నందన్ యీ సంగతి విని గాభరాఅయిపోయాడు. పాపం ఎవరు అతనికి సహాయం చేస్తారు? బీదవాడైన ఆ హరిజనుడు రాజుగారికోపంనుండి ఎలా రక్షింపబడతాడు?

చివరికి నందన్ పరుగెత్తుకుంటూ మొదలియార్ ఇంటికి వెళ్లేడు. ఆ సమయంలో మొదలియార్ తన యింటిబయట కూర్చుని వున్నారు. నందన్ పరుగెత్తుకుంటూ మొదలియార్ కాళ్లమీదపడి "మొదలియార్‌గారూ రాజుసిపాయిలు నన్ను పట్టుకుంటానికి వస్తూ వున్నారు. వాళ్ళనుండి నన్ను కాపాడండి, జీవితమంతా మీకు చాకిరి చేస్తాను" అన్నాడు. ఈ మాటలువిని మొదలియార్ మనస్సు కరిగిపోయింది. ఆయన

**కె. వాణి**

ఎంతో ఆదరంతో లోపలికి తీసుకువెళ్లి శుభ్రమైన బట్టలు ఇచ్చి కట్టుకోమన్నాడు. నీకేమీ భయం లేదు. నేను రాజుగారి సిపాయిల నుంచి నిన్ను రక్షిస్తాను అని అన్నారు మొదలియార్‌గారు.

ఇంతలోనే రాజుగారి సిపాయిలు నందన్ వాళ్ళయింటిలో కనబడకపోతే మొదలియార్ యింటికి వచ్చారు. వాళ్లు వస్తూనే "ఇక్కడ నందన్ వున్నాడా? మేము రాజుగారి ఆజ్ఞానుసారం నందన్‌ని పట్టుకెళ్ళడానికి వచ్చాం" అన్నారు. "నందన్ యిక్కడలేడు. మీరు అతని యింటికివెళ్ళి వెదకండి" అన్నారు మొదలియార్‌గారు తొణకకుండా. నందన్ ఆయన ప్రక్క శుభ్రమైన బట్టలువేసుకుని వున్నాడు. నందన్ మంచిబట్టలువేసుకుని వుండడంవల్ల ఎవ్వరూ త్వరగా ఆనవాలుపట్టలేదు. కానీ అందులో ఒకసిపాయి నందన్‌ని కొద్దిగా ఆన

వాలుపట్టి అరే వీడు నందన్‌లాగా వున్నాడు. చక్కగా శుభ్రమైన బట్టలు వేసుకుని ఎలా కూర్చున్నాడో చూడు, అన్నాడు. ఆ మాటలు మొదలియార్ విని ఇతడు నందన్ కాదు నా బంధువు అన్నారు. కానీ సిపాయిలు నమ్మలేదు. ఇతడు మీబంధువుఅంటే మేమునమ్మము. అతనే మీ బంధువు అవుతే అతని పక్కన కూర్చుని మీరు భోంచేస్తారా? అని ప్రశ్నించారు సిపాయిలు.

అంటే ఆరోజులలో ప్రజలు హరిజనులను చాలా నీచంగా చూసేవారు. వాళ్లని అంటుకోకూడదని దూరం, దూరంగా నడుస్తూవుండేవారు. అటువంటప్పుడు ఎవ్వరు హరిజనుని ప్రక్కన కూర్చుని భోజనంచేయటానికి సాహసిస్తారు? కానీ మొదలియార్ అటువంటి మనిషి కాదు. ఆయనదృష్టిలో అంతా ఒకటే. సిపాయిలప్రశ్న విని మొదలియార్ "వెంటనే అవును యీయన నా బంధువే. నాబంధువు ప్రక్కన కూర్చుని భోజనంచేయటానికి నాకు అభ్యంతరం ఏమిటని జవాబు ఇచ్చాడు. తన భార్యను త్వరగా వడ్డించమని నందన్, ఆయనా ఒకరి పక్కనొకరు కూర్చుని భుజించటమారంభించారు. ఆ దృశ్యం చూసి సిపాయిలు ఏమీ చెప్పలేక వెళ్ళిపోయారు. ఉదారుడైన మొదలియార్ వలన ఆనాడు నందన్ అలా రక్షింపబడినాడు. హరిజనులంతా మొదలియార్‌ని ఎంతో పొగడడం మొదలుపెట్టారు. ఇప్పటికీ ఆ మొదలియార్ వంశం హరిజనులని ఎంతో ప్రేమిస్తుందట.

పాపాయిలూ మీరుకూడా హరిజన బాలలతో ఆడుకోండేం. అంతేగాని అప్పటి మూఢ ప్రజలలాగా మీరుకూడా వాళ్ళని దూరంగా వెళ్ళగొట్టవద్దు. వాళ్ళూ మీలాంటి పాపాయిలే. ★





## హకల్‌బెరీ ఫిన్

(30-వ పేజీ తరువాయి)

నాన్న చేతిదెబ్బలకి తప్ప—అలవాటైపోయాను.

ఖులాసాగానే వుండేది, బద్ధకంగా రోజంతా చుట్టలు కాలుస్తూ, చేపలు పడుతూ గడపటం. అందులో పుస్తకాలూ, బాదరబందీ ఏమీ లేదు. రెండు నెలలయ్యేటప్పటికి నాబట్టలు మాసి, చిరిగి తోళ్లయ్యాయి. వంటిమీద మడ్డి పేరుకుంది. నాకాశ్చర్యం కలిగించిన విషయ మేమంటే, అమ్మగారింటిలో ఉన్నన్నాళ్లూ, రోజూ స్నానంచేస్తూ బట్టలు మారుస్తూ, తల దువ్వుకుంటూ, టైముకు పడుకుంటూ, లేస్తూ, పుస్తకాలు చదువుతూ, ఎల్లా బతికానా అని. అన్నింటికంటే వింత!—బూతులు ఎల్లా మానేశానా అని. కాని మానాన్నతో ఉండటం మొదలెట్టాక, వాడికేమీ అభ్యంతరం లేనందున యథాప్రకారంగా బూతులు అలవాటు చేసుకున్నాను.

మానాన్న బాధ రోజురోజుకీ ఎక్కువైంది. నన్ను లోపలపెట్టి తాళం వేసిపోయేవాడు. ఒకసారి అల్లాపోవటం పోవటం మూడురోజుల దాకా రాలేదు. ఇక రాడేమో, నదిలో మునిగి కొట్టుకుపోయాడేమో అని భయపడ్డాను. అంటె వాడు మునిగిపోయినందుకు కాదు, నేను ఇంట్లోంచి బయటపడటం



ఎల్లాగా అని. తప్పించుకు పోయేందుకు ఎన్నో ఉపాయాలు ప్రయత్నించి చూశాను. కాని మానాన్న బాగా కట్టుదిట్టాలు చేసి మరీపోయాడు. గోడలకి పిల్లి దూరేందుకైనా సరిపడే కిటికీలు లేవు. తలుపులు బలమైన కొయ్యలతో చేయబడినవి. ఇంట్లో ఎక్కడన్నా కత్తి దొరుకుతుందేమోనని వెదికాను. కాని అల్లాంటి వస్తువులేవీ లేకుండా చేశాడు మానాన్న. ఒక వంద సార్లయినా ఇల్లంతా తిరగతోడి వుంటాను కత్తికోసం; దొరుకుతుందనే ఆశతో కాదు, చెయ్యటానికి మరేపనీ లేక. చివరికి చూరులో ఒక చిన్న రంపం దొరికింది. దానికి పిడిలేదు. దాన్ని కొంచెం సానబట్టి పని ప్రారంభించాను. ఒకమూల ఒక బల్లవున్నది. దానివెనక గోడలో ఒక చిన్న రంధ్రం వున్నది. ఆరంధ్రంలోంచి గాలి రాకుండా మానాన్న దాన్ని ఒక గొంగళీతో మూసేశాడు. గొంగళీ ఒత్తిగించి చూశాను. ఆకంత చాల చిన్నది. అందుచేత రంపంతో దాన్ని పెద్దది చెయ్యటానికి పూనుకున్నాను. రోజంతా కష్టపడగా పని చాలమటుకు పూర్తయింది. ఇంతలోకే అడవిలో తుపాకిమోత వినిపించింది. వెంటనే నా పనిముట్లు, తవ్విన మట్టి అన్నీ దాచేసి,గొంగళీ యథాప్రకారంగా మూసేసి ఏమీ ఎరగనట్టు కూర్చున్నాను. ఇంతలోకే మానాన్న వచ్చాడు.

మానాన్న ఉత్సాహంగా లేడు. అంటే సహజ ధోరణిలోనే ఉన్నాడన్నమాట. ఊళ్లోకి వెళ్లాడట కేసువిషయం కనుక్కుందామని. కాని ఆ కేసు ఎప్పటికప్పుడు వాయిదా వేయిస్తున్నారట థాచర్‌గారు, అమ్మగారు. విచారణ గనక జరిగితే కేసు తప్పక గెలుస్తామనీ డబ్బుతప్పక వస్తుందనీ మానాన్నతరఫు ప్లీడరు చెబుతున్నాడట.

ఇదిట్లా వుండగా అమ్మగారు మళ్ళీ కేసు పెట్టబోతోందట, నన్నెల్లాగయినా మానాన్ననుంచి తప్పించి తన సంరక్షణలో ఉంచుకోవాలని. ఈసారి ఆవిడ నెగ్గుతుందని కూడా ఊళ్లోవాళ్లు అనుకుంటున్నారట. ఈమాట విని నాకు మళ్ళీ విచారం కలిగింది. ఎందుకంటే అమ్మగారింటికి పోవటం నాకిష్టం లేదు. ఇక్కడెంత స్వేచ్ఛవుందో, అక్కడా అంతే.

అక్కణ్ణించి మానాన్న జడ్జిథాచర్‌గార్ని, అమ్మగార్ని, కొత్త జడ్జిని, ఇంకా ఎవరెవర్నో బండ బూతులు తిట్ట సాగించాడు. వాళ్లంతా ఎదురుగా ఉన్నట్టే వూహించుకుని, పేరుపేరునా పిలిచి వాళ్లని తిట్టాడు. పేరుతెలియనివాణ్ణి తిట్టాల్సివస్తే నాకేసి తిరిగి, "వాడి పేరేమిటి, వాడున్నాడే, వాడు దొంగలం—" అని తిట్టాడు.

తరవాత నన్ను పిలిచాడు. నదిఒడ్డున పడవలో తను తెచ్చిన సరుకు పట్టుకు రమ్మన్నాడు. పడవలో గోధుమపిండిసంచీ, కొంత మాంసం, తుపాకి మందు, నాలుగుగాలన్ల విస్కీ ఉన్నాయి. అవన్నీ ఇంటికి చేరేశాను. మళ్ళీపోయి పడవలో కూర్చున్నాను. చాలాసేపు ఆలోచించాను. ఆరాత్రి గనక మానాన్న స్పృహ పోయేదాకా తాగేట్లయితే, మెల్లిగాలేచి పారిపోవాలనుకున్నాను. పోయేటప్పుడు తుపాకి, కొంత మందు, రెండుమూడు చేపల గాలాలు కూడా పట్టుకుని, మానాన్నగాని, డగ్లస్ అమ్మగారుగాని కనుక్కోలేనంత దూరానికి పారిపోవాలనుకున్నాను.

ఇల్లా ఆలోచిస్తుండగా నాకు తెలియకుండానే సూర్యుడస్తమించాడు. మానాన్న నేను నిద్రపోయానో, నదిలో మునిగిపోయానో అనుకుంటూ వచ్చాడు. వాడితోకలిసి ఇంటికి తిరిగివచ్చాను. అప్పటికి చీకటి పడింది. నేను వంటచేయటం మొదలెట్టాను. మానాన్న గ్లాసెడు విస్కీతాగాడు. దాంతో ఉషారు పుట్టిందిగావును, ప్రభుత్వంమీద ఉపన్యాసం ప్రారంభించాడు:

"ఇదా ప్రభుత్వమంటే, ఇదేనాఅంట? నా సొంత కొడుకుని నాదగ్గర్నుంచి లాక్కుపోవటానికి వీళ్లకే మధికారం వుంది? వాణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేసింది నేనా, కోర్టువాళ్లా? అదల్లా వుంచు. ఆ జడ్జి థాచర్‌గాడు నాడబ్బంతా దగ్గర పెట్టుకూర్చున్నాడు. నాడబ్బు నాకిప్పించండ్రా అంటే ఈకోర్టువాళ్లు వినిపించుకోరాయెను. ఏం ప్రభుత్వమూ అంట ఇది? పోని డబ్బు పోతే పోయిందిలే అనుకుందామంటే, కాస్తా కూస్తా డబ్బుకాదాయె; ఆరువేల డాలర్లపైచిల్లర. ఎవ డబ్బ సొమ్మని? అది నాదా, వాళ్ళదా? నాడబ్బు నాకెందు కివ్వరు? ఆరువేల డాలర్లు నాకు రావలసి ఉండగా, నేనేమో కుళ్లుగుడ్డలు కట్టుకుని, కడుపునిండా తాగటానికైనా లేకుండా, ఈ వెధవ

కొంపలోపడి ఏడవనా? ఇదీ ఈదేశంలో ప్రభుత్వం చేసేపని. తండ్రినీ కొడుకునీ వేరుచెయ్యటం, న్యాయంగా రావల్సిన డబ్బు ఇవ్వకపోవటం. ఛీ. ఇంతకంటే దురన్యాయం ఇంకెక్కడన్నా వుందీ? అసలు చూస్తా, చూస్తా, ఎప్పుడో ఈదేశంమీద ఉమ్మేసి, ఇంకోదేశం పోతా. ఈమాటే చెప్పాను జడ్జి థాచర్‌తో. ఆయనతోనే కాదు, ఇంకా చాలా మందితో చెప్పా. ఎవరైనా అడుగు కావలిస్తే, చెప్పానో లేదో. నాటోపీ తీసి చూపించా. ఇదేమిటని అడిగా. టోపీ అన్నారు. నాకు బలే నవ్వొచ్చిందిలే. దీన్ని టోపీ అని మెడకాయ తలకాయమీద ఉన్నవాడు ఎవడైనా అంటాడూ? ఈ చుట్టుపక్కలగల గొప్ప ధనవంతుల్లో ఒకడు, మర్యాదస్తుడు, పెద్దమనిషీ, గౌరవస్తుడు ఇల్లాంటి పాతబొచ్చె నెత్తిమీద పెట్టుకుని తిరుగుతున్నాడంటే ఎవరన్నా నమ్ముతారూ?

ఇదిగో ఇల్లాంటి అన్యాయాన్ని చూస్తూ చూస్తూ వూరుకునేది ఏం ప్రభుత్వమూ అంట? ఇంతెందుకు? నిన్న రోడ్డుమీద ఒక నీగ్రోను చూశాను. తెల్లవాడా అనిపించేటంత తెల్లగా వున్నాడు ముండాకొడుకు. మల్లెపువ్వులాంటి బట్ట లేసుకున్నాడు. అంత మంచిబట్టలు తెల్లవాళ్లుకూడా వేసుకోరు. ఆ నీగ్రో వేసుకున్నాడు. వాడిచేతికి బంగారపు గడియారం వుంది. చేతిలో వెండిపొన్ను ఉన్న కర్ర వుంది. నవాబులాగా దర్జాగా తిరుగుతున్నాడు. వాడు ఏదో కాలేజీలో ప్రొఫెసరుట; బోలెడుభాషలు మాట్లాడతాడట. అంతేకాదు. వాడి మొహానికి వాడికిత్తోడు వోటింగ్ హక్కుకూడా వుందిట. నాకు మండిపోయిందనుకో. నీగ్రోక్కూడా వోటింగ్ హక్కా? హార్నీ ఏం దేశం, ఏం ప్రభుత్వం? గుడ్డిముండ రాజ్యమేల్తోందా? ఇల్లాగయితే ఈదేశం ఇంకెందుకన్నా పనికొస్తుందా? అసలు నిన్న ఎన్నికలు జరిగాయి. బాగా తాగివున్నా, నేనుకూడా వోటు చేద్దామనుకున్నా. కాని ఈ అమెరికా దేశంలో నీగ్రోలనుకూడా వోటు చెయ్యనిచ్చే రాష్ట్రం వొకటివుందని ఎవరో చెప్పారు. దాంతో ఎన్నికలమీద అసహ్యంవేసి ఇవతలి కొచ్చేశా. ఇక ఛస్తే ఎప్పుడూవోటు చెయ్యనని వాళ్లతో చెప్పా. కావలిస్తే వాళ్ల నడుగు.

సరే, ఇంతకీ ఆ నీగ్రోసంగతి ఏమైందో తెలుసా? నేను ఎదురుగా వస్తుంటే వాడు దూరానికి తప్పుకోవాలా? ఊహూ. తప్పుకోలా. రాచుకుంటూ పోయాడు వాడి దుంపతెగ. నేను కొందర్నడిగాను. ఆ నీగ్రోను వేలంవేసి అమ్మరేమని. వాళ్లేమన్నారనుకున్నావు? వాడు ఈరాష్ట్రంవాడు కాదుట. ఈ రాష్ట్రంలో ఆరునెలలైనా ఉండకపోతే వాణ్ణి అమ్మటానికి ఎవరికీ హక్కులేదుట. చూడు, ఇదీ ప్రభుత్వం. ఈరాష్ట్రంలో ఆరునెలలపాటు ఉండని నీగ్రోను అమ్మేందుకు అధికారంలేదు ఈప్రభుత్వానికి. ఛీ!—"

ఇల్లా తనతో తను మాట్లాడుకుంటూ మా నాన్న అటునుంచి ఇటూ, ఇటునుంచి అటూ తిరుగుతున్నాడు. తిరుగుతూ, తిరుగుతూ ఒక పక్కగావున్న నీళ్ల తొట్టిమీదికి తూలి బోల్తాకొట్టాడు. వళ్లూ, తలా అంతా తడిసి ముద్దయింది. దాంతో ఇంకా జోరుగా ప్రభుత్వాన్ని, నీగ్రోప్రొఫెసర్‌ని, నీళ్లతొట్టినీ తిట్ట సాగాడు. తొట్టిచుట్టూ కొన్నిసార్లు తిరిగాడు. ఇక కోపం పట్టలేక చాచి తన్నాడు దాన్ని. కాని బూటులోంచి తొంగిచూస్తున్న రెండు మూడు వేళ్లు విరిగాయి. కాలు బెణికింది. నేలమీదపడి, కాలివేళ్లు పట్టుకుని, కుయ్యో మొర్రో మంటూ బాధ భరించలేక కేకలు వేశాడు. ప్రభుత్వాన్ని, తొట్టినీ కలిపి ఇంకా గట్టిగా తిట్టాడు. ఆ బూతులు వర్ణనాతీతం. నాజీవితంలో ఎప్పుడూ అన్నిబూతులు, నవి కొత్తవి వినలేదు.

రాత్రి భోజనమయ్యాక మా నాన్న మళ్ళీ తాగాడు. చాలాగ్లాసులు ఖాళీచేశాడు. ఇంకో గంటలో తలతిరిగి, స్పృహతప్పి పడిపోతాడనీ, అప్పుడు జేబులోంచి తాళం చెవితీసి, తలుపుతెరచి పారిపోవాలనీ అనుకున్నాను. కాని మానాన్న స్పృహ తప్పిపోలేదు. పక్కమీద దొర్లుతున్నాడు. ఎంతసేపటికీ వాడికి నిద్దరాలేదు. కొంతసేపు మూలిగాడు; కొంతసేపు ఏడ్చాడు. నేను ఈలోగా నిద్ర ఆపుకోలేక గోడకు జార్లబడి నిద్దపోయాను.

అలా ఎంతసేపు నిద్రపోయానో తెలియదు. ఏదో అరుపు విని భయపడి లేచాను. మానాన్న పిచ్చి చూపులు చూస్తున్నాడు. "పాముల్లోయ్, పాములు బాబోయ్" అని అరుస్తున్నాడు. ఎగిరెగిరి గంతులు వేస్తున్నాడు. నాకెక్కడా పాములు కనిపించలేదు గాని

మానాన్న "బాబోయ్ మెడమీద కరిచింది" అని అరుస్తూ గిరగిర తిరగ నారంభించాడు. "పాము, పాము, మెడకి చుట్టుకుంది, లాగెయ్, లాగెయ్" అని అరిచాడు.

వెంటనే నేలమీద పడ్డాడు. ఈమూలనుంచి ఆ మూలకి అతివేగంగా దొర్లాడు. అడ్డంవచ్చినవన్నీ తన్నేశాడు. గాలిలో ఏవో పట్టుకోబోతున్నట్టు చేతులు విసిరాడు. చుట్టూ దెయ్యాలు ముసురుతున్నాయన్నాడు. కొంతసేపటికి అలిసిపోయి, నిశ్శబ్దంగా పడుకున్నాడు. మళ్ళీ లేచి కాళ్ళతోను, చేతులతోను, పాకుకుంటూ, "అవిగో దెయ్యాలు! దెయ్యాలు! దెయ్యాలు! మీద పడుతున్నాయ్, రక్కుతున్నాయ్, పీకుతున్నాయ్, బాబోయ్!" అంటూ ఒక గొంగళీ కప్పుకున్నాడు. "బాబూ! నాదగ్గిరికి రాకండి. మీకు దణ్ణంపెడతాను. చంపకండి," అని ఏడ్చాడు.

కాసేపటికి గొంగళీ తీసేసి నుంచున్నాడు. నేను ఒకమూల వణుకుతూ, ఒదిగొదిగి కూర్చున్నాను. నన్ను చూశాడు. చాకు తీసి వెంటపడ్డాడు. నేను మృత్యుదేవతనిట. అందుకని నన్ను చంపేస్తానన్నాడు. "నేను హాకల్ బెరీఫిన్‌ని, దేవతని కాదు," అని బతిమాలుకున్నా వినలేదు. నేను వాణ్ణించి తప్పించుకుంటూ ఇల్లంతా పరుగెత్తాను. పరిగెత్తి పరిగెత్తి అలిసి పోయాడు. చివరికి తలుపు కడ్డంగా పడుకున్నాడు. చాకు ముడిచి జేబులోపెట్టుకున్నాడు. కాస్త బలంవచ్చాక లేచి నన్ను చంపేస్తానన్నాడు.

అల్లా పడుకుని నిద్రపోయాడు. నేను మానాన్న అటకమీద పెట్టిన తుపాకితీసి, మందు కూరి, వాడికేసి గురిపెట్టి కూర్చున్నాను. లేచి, మీదబడే మాటుంటే పేల్చి చంపేద్దామనుకున్నాను. అలా చాలసేపు గడిచింది.

(ఇంకావుంది)

# పావురం

( 4-వ పేజీ తరువాయి)

పాడుబడ్డ నూతుల్లోను, శిథిల గృహాల్లోను గుంపులు గుంపులుగా గూళ్లు కట్టుకుని ఉండటం కనిపిస్తుంది. పొద్దున సాయంత్రం ఈగుంపులు పొలాలమీదికి పోయి మేత ఏరుకుని రావటం, పోవటం చూస్తాం. కొత్తగా విత్తిన జొన్నలు, కందులు, పెసలు, వేరుసెనగ మొదలైనవాటిని ఇవి ఎత్తుకుపోయి కొంతవరకూ నష్టం కలిగిస్తాయి. అతివేగంగా, బలంగా ఎగరగలవు. ఏడాదిపొడుగునా గుడ్లు పెడతాయి. కాని వానా కాలంలో అంతగా గుడ్లుపెట్టవు. ఒడవకు కనీసం 2 గుడ్లు పెడతాయి. వాటిని పొదగటానికి 16 రోజులు పడుతుంది.

## రూసో

(26-వ పేజీ తరువాయి)

వుండేవాళ్లు. ఆ రాజులు నిరంకుశులు. వాళ్లేం చేసినా అడిగేవాడు లేడు. వాళ్లు సరదాకోసం జంతువులను వేటాడినట్టే దోవనపోయే మనుషులను చంపెయ్యవచ్చు. ఒక అమాయకుణ్ణి నిష్కారణంగా ఖైదులో పెట్టి హింసించవచ్చు. వాడి ఆస్తిని జప్తు చెయ్యవచ్చు. ప్రజల మీద ఎన్ని పన్నులైనా వేసి వాళ్లని మాడబెట్టి తాము విలాసాల్లో, వైభోగాల్లో తేలవచ్చు. ఇల్లాంటి అధికారాలు రాజులకే కాక, వాళ్ల కింద ఉండే సామంతులకి, జమీందార్లకికూడా ఉండేవి. వాళ్లెన్ని అన్యాయాలు, ఘోరాలు చేసినా కేసులేదు. దేశంలో కొద్దిమంది మాత్రమే భాగ్యవంతులు. మిగతా వాళ్లంతా దరిద్రులు.

ఇల్లాంటి పరిస్థితులుచూసి వళ్లు మండిపోయింది రూసోకి. అసహ్యం వేసింది రాజులమీద. ఆ అన్యాయాలని ఎదిరిస్తూ పుస్తకాలు రాశాడు. అంతవరకూ రాజులు, వాళ్లతరఫున ప్రజల్ని మోసగించే మతగురువులు ఏమని చెప్తూ వచ్చారంటే "రాజులకు ప్రజలను పరిపాలించే హక్కు దేవుడిచ్చాడు. అందుచేత రాజులను ప్రశ్నించే హక్కు ప్రజలకి లేదు", అని. రూసో దీన్ని ఖండించాడు. మానవులంతా సమానమే అన్నాడు. అందరూ స్వతంత్రులే అన్నాడు. మొట్టమొదట రాజులంటూ వుండేవాళ్లు కాదు. ఎవడికి వాడే స్వతంత్రుడుగా వుండేవాడు. ఇల్లా వుండగా కొంత కాలానికి బలవంతులైన వాళ్లు బలహీనులైన వాళ్లని బాధించటం మొదలెట్టారు. ఎవడికి బలంవుంటే వాడు మిగతా వాళ్లని ఏడిపించే వాడు. అప్పుడు ప్రజలంతా చేరి "ఇల్లా ఎవడిష్టం వచ్చినట్టు వాడు చేస్తే లోకంలో బలహీనులకు రక్షణ వుండదు. అందుచేత మనమంతా ఒకకట్టుగా వుండాలి. ఒక నాయకుణ్ణి ఎన్నుకుని వాడు చెప్పినట్టు విందాం. ఆ నాయకుడు దుర్మార్గంగా ప్రవర్తిస్తే వాణ్ణి తీసేసి ఇంకోణ్ణి ఎన్నుకుందాం," అనుకున్నారు. ఒక నాయకుణ్ణి ఎన్నుకున్నారు. ఈ నాయకుల పరిపాలన కొంత కాలం బాగానే సాగింది. క్రమంగా వాళ్లు స్వంత సైన్యాలు పోగు చేసుకుని నిరంకుశంగా పరిపాలించటం మొదలెట్టారు. ఆ నాయకులకు సైన్యం వుండటంవల్ల ప్రజలు వాళ్లని తొలగించటానికి వీల్లేకపోయింది. ఈవిధంగా మొదట ప్రజలచేత ఎన్నుకోబడిన నాయకులు రాజులై కూచున్నారు. ఈరాజుల్ని ప్రజలంతా ఏకమై తొలగించాలి. ప్రజల ఇష్టప్రకారం పాలించే వాళ్లనే కొందర్ని ఎన్నుకోవాలి. వాళ్లు ప్రజలకెదురు తిరిగితే వాళ్లని తొలగించాలి. అసలు అధికారం ప్రజలది. అంటూ పుస్తకాల్లో రాశాడు రూసో. అంతకు ముందు ఇంతధైర్యంగా రాజుల అధికారం మీద రాసినవాడెవడూ లేడు.

రూసో ఇల్లాంటి పుస్తకాలు రాసినందున ఫ్రాన్సుదేశపు రాజు లూయీ అతన్ని శిక్షించాలని ప్రయత్నించాడు. కాని రూసో దేశంనుండి పారిపోయి ఇతర దేశాల్లో తలదాచుకున్నాడు. అయినా అతని పుస్తకాలు దేశంలో రహస్యంగా చదువుతూవుండేవాళ్లు.

రూసోలో చెప్పుకోదగిన మంచి గుణాలేమీ లేవని చెప్పాను. చివరికతడెలా చచ్చిపోయాడో తెలుసా? ఎప్పుడూ తాగి నిషామీద వుండేవాడు కదూ. చివరి రోజులలో మూర్ఛరోగం పట్టుకుంది. పిచ్చెక్కింది. 1778 జులై 2 వ తారీకున అతని శవం రోడ్డుపక్కన ఎక్కడో పడిపోయి వుంది. మూర్ఛలోనే చచ్చిపోయాడో, లేక తన్ను తనే పొడుచుకుని చచ్చిపోయాడో ఎవరికీ తెలియలేదు. ఫ్రాన్సుదేశస్థులు తమ మహాపురుషుల్లో ఒకడని గౌరవించే రూసో ఇంతవిచిత్రంగా చనిపోయాడు.

అతని శరీరం చనిపోయినా అతని పుస్తకాలు, సిద్ధాంతాలు, ఉపదేశాలు చనిపోలేదు. అవి దేశదేశాలా వ్యాపించాయి. ముఖ్యంగా ఫ్రాన్సుదేశంలో వాటి ఫలితంగా గొప్ప విప్లవం చెలరేగింది. అతడు చనిపోయిన పదేళ్ల తరవాత విప్లవం ప్రారంభమై పాతికేళ్ల పాటు సాగింది. ప్రజలు తిరగబడి రాజును, రాణిని, జమీందార్లను చాలమందిని, చంపేశారు, ప్రజాస్వామిక ప్రభుత్వం అంటారే దాన్ని స్థాపించారు. ఆ చరిత్ర పెద్దయ్యాక నీ అంతట నువ్వు చదువుకుంటే బాగా అర్థమౌతుంది. ఇక వుంటా.

నీ అన్నయ్య.

—ఎన్నార్

# రాగోదయం

(20-వ పేజీ తరువాయి)

విజయ : అదుగో శ్రీమంతరావుగారు కూడా మాటల్లోనే వొచ్చారు. శ్రీమంత రావుగారూ చక్రధరరావుగారి మహిళా విద్యాలయానికి మీరో వెయ్యిరూపాయలు విరాళ మివ్వాలి.

శ్రీమంత : ఈ విద్యాలయాలంటే నాకు నమ్మకంలేదు విజయా, అయినా నువ్వు ఇమ్మంటున్నావు గనక ఇస్తాను...ఎవరి పేర రాయను చెక్కు ?

విజయ : రమపేర రాయండి.

శ్రీమంత : ఇదిగో రమాదేవీ. శేఖరం గారు కులాసాగా ఉన్నారా ? ఈమధ్య రావటం మానేశారు.

రమ : కులాసాగానే ఉన్నారు. కృతజ్ఞురాలిని. వొస్తా విజయా, నువ్వూ శ్రీమంత రావుగారూ, మీ రిద్దరూ రేపు మహిళా విద్యాలయ ప్రారంభోత్సవానికి తప్పక రావాలి. మీ కోసం ఎదురుచూస్తుంటాను. (నిష్క్రమణ)

శ్రీమంత : మహిళావిద్యాలయంట. ఆ చక్రధరరావుని పట్టుకుని పాకులాడితే చివరికి జైలుప్రాప్తి తప్పదు కొంపతీసి, నువ్వు ప్రారంభోత్సవానికి వెడతానన్నవు గద, విజయా...

విజయ : ఎందుకు వెళ్ళను ?

శ్రీమంత : నువ్వు వెళ్ళటానికి వీల్లేదు విజయా.

విజయ : ఎందుకు వీల్లేదు ?

శ్రీమంత : ఆ పనికిమాలినవాళ్ళతో తిరగటం నా కిష్టంలేదు.

విజయ : చక్రధరరావు నాస్నేహితుడు. అతను పనికిమాలినవాడా? అయితే ఇక పనికొచ్చేవా రెవరు? నేనూ, మీరూనా ?

శ్రీమంత : (ఆశ్చర్యంగా) విజయా అంత తిరస్కారమా ?

విజయ : చక్రధరరావు కష్టజీవి, శ్రమజీవి, సంఘజీవి, భావజీవి. ఒక్కమాటలో ఆదర్శజీవి.

శ్రీమంత : మూడునాలుగు నెలల్నించీ నువ్వు బాగా మారావు. చూస్తే అతని వాగుడు నీక్కూడా తలకెక్కినట్టుంది.

విజయ : అతనిది వాగుడు కావొచ్చు. కాని అలా అయితే మనది ప్రేలుడనక తప్పదు.

శ్రీమంత : (కోపంగా) విజయా (శాంతించి) నన్ను క్షమించు, విజయా, నీ మనసుకి అనవసరంగా కష్టం కలిగించాను. కాని నాకు కాబోయే భార్య నా హోదాకి తగినట్టుగా ప్రవర్తించొద్దా? ఆ అలగాజనంతో సంబంధం పెట్టుకోటం మన హోదాకి భంగకరం. నేను అభివృద్ధి నిరోధకుడ్ననుకోవొద్దు. కాని ప్రాక్టికల్‌గా మాట్లాడుతున్నాను. ఆ విద్యాలయానికి వెడితే నిన్ను కీర్తి ఎరచూపించి దాంట్లో పనిచెయ్యమని అతను బలవంతం చేస్తాడు. నీకూ అతని ఆదర్శాలు వంటబట్టవచ్చు. నువ్వో విషయం జ్ఞాపకం ఉంచుకోవాలి. అతను డబ్బులేనివాడు. అంచేత వ్యక్తిగతంగా తనకేమీ నష్టంలేదు. మనం డబ్బున్నవాళ్ళం. మనకీ ఆ ఆదర్శాలుంటే మన ధనమంతా త్యాగం చెయ్యాలిసి ఉంటుంది. ఏవో పిచ్చి ఆదర్శాలు పెట్టుకొని సర్వస్వం వొదులుకోటంకంటె తెలివితక్కువ మరోటి లేదు. ఏమంటావు ? ఇప్పటి కిప్పుడే వెయ్యిరూపాయలు వొదిలాయి, చూశావా ?

విజయ : మీ డబ్బువిషయంలో మీరు చాలాదూరదృష్టిగలవారు. డబ్బుమీద నాకంత మమకారంలేదు. లేదనటంకంటె తగ్గిందనటం సమంజసం.

శ్రీమంత : అప్పుడే నువ్వు చెయ్యిదాటి చాలాదూరం వెళ్ళావు.

విజయ : అయితే పూర్తిగా వెళ్ళనీండి. (విరామ సూచనగా జంత్ర సంగీతం)

*  *  *

(టెలిఫోన్ బెల్ మోగుతుంది)

విజయ : హలో...జనరల్ హాస్పిటల్ నించా ? ఏమిటి రమా...ఆఁ చక్రధర రావుగారు ప్రమాదస్థితిలో ఉన్నారా?... తలమీద గాయమా ? వొస్తున్నా. (కొద్దిక్షణాలు జాలిగా సంగీతం)

విజయ : అసలీ ప్రమాదం ఎలా సంభవించింది ?

చక్రధరరావు : ఒక ప్రముఖ మిల్లు యజమాని విపరీతంగా బ్లాక్‌మార్కెట్ చేస్తున్నాడని తెలిసింది. ఆ మిల్లులో పనిచేసే గోపాల్ అనే కుర్రవాడి సహాయంతో రుజువుకోసం ప్రయత్నించాను. అతను రెండు సెట్ల పుస్తకాలు తయారు చేస్తాడని తెలిసింది. రాత్రిపూట బ్లాక్‌మార్కెట్ తాలూకు లెక్కలు రహస్య పుస్తకాల్లో రాసుకుంటున్న సమయంలోమారువేషంతో ఎవరో చుట్టం అని చెప్పుకుని లోపలికి ప్రవేశించి పుస్తకాలు పట్టుకున్నాను. కాని నేను బయటికి రాబోయే సమయంలో నాతలమీద కట్టిదెబ్బ పడ్డది. రెండురోజుల తర్వాత ఇవాళే మళ్ళీ మన లోకంలో పడ్డాను.

విజయ : అయినా బ్లాక్‌మార్కెటీర్లని పట్టుకోటానికి సి. ఐ. డి వాళ్ళుండగా మీ కెందుకీ శ్రమ ?

చక్ర : విజయా, నేను సి. ఐ. డి స్పెషల్ బ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ని.

విజయ: (ఆశ్చర్యంగా) సి. ఐ. డి ఇన్‌స్పెక్టర్...

చక్ర: అవును, రమాదేవిని మా విద్యాలయంలో నియమించి ఈవాలుగు నెలల నించీ నేనుచేస్తున్న ఉద్యోగం ఇదే. ఒకప్పుడు మీనాన్నగారు నాకుద్యోగం ఇప్పిస్తానని వాగ్దానం చేశారు. కేవలం వారి సహాయంవల్లే నేనీ ఉద్యోగం సంపాదించగలిగాను. కాని ఈ ఉద్యోగానికి ఇవాళ రాజీనామా ఇస్తాను.

విజయ: ఎందుకు?

చక్ర: నేను బ్లాక్‌మార్కెటీర్లని గురించి స్వయంగా తెలుసుకోవాలనుకున్నాను. వాళ్ల వ్యాపార రహస్యాలు గ్రహించాను. ఈ విషయాల్ని గురించి ప్రభుత్వానికి నివేదిక సమర్పిస్తాను. పొద్దున పోలీస్ కమిషనర్ వొచ్చి నాకు ప్రమోషన్ వొస్తుందన్నాడు. కాని ఈ ఉద్యోగం జంజాటంలో పడితే నా జీవితాదర్శాలు మట్టిలో కలిసిపోతాయి.

విజయ: మిమ్మల్ని ఒక విషయం అడగాలని ఉంది.

చక్ర: ఏమిటది?

విజయ: రిక్షా ఎందుకు లాగాలి సొచ్చింది?

చక్ర: (స్తబ్దుడై) మీ కెలా తెలిసింది?

విజయ: నేనంత తెలివితక్కువదాన్ననా మీ అభిప్రాయం? ధనికసమాజంమీద కసి తీర్చుకోటానికేనా రిక్షా లాగింది?

చక్ర: కాదు. శ్రామికుల కష్టసుఖాల్ని స్వయంగా అనుభవించి తెలుసుకోవాలని ప్రయత్నించాను. అనుభవం లేకుండా వాళ్ల కష్టాల్ని దేశానికి సరిగా తెలియచెయ్యటం కష్టం. మిల్లు కూలీగా, రైల్వే కార్మికుడిగా, పొలం రైతుగా, హోటల్ సర్వర్ గా పనిచేశాను. రిక్షా కూడా లాగాను. కాని ఈ దెబ్బవల్ల ఈ అనుభవం ఎందుకూ పనికిరాకుండా పోవాలిసింది.

విజయ: అలా ఎప్పటికీ జరగదు. మీ వల్ల దేశానికి జరగాలిసిన మేలు చాలా ఉంది. వ్యక్తులభావాల బూజునీ, వంకరనీ తీసివెయ్యాలిసిన భారం మీమీద చాలా ఉంది. భావాలబూజు దులపటం సులభమే గాని, వంకరతియ్యటం చాలా కష్టమని నేనూ ఒప్పుకుంటున్నాను. కాని నిస్పృహ చెందకుండా ప్రయత్నించాలి.

చక్ర: మనసులో ఏదో ఉద్దేశించి మాట్లాడుతున్నట్టున్నారు.

విజయ: మీరన్న మాటలే.

చక్ర: (కాసేపాగి) రమాదేవి చెప్పిందా?

విజయ: (వినిపించుకోక) కాని చక్రధరరావుగారూ, నావి వంకరభావాలు కావని మీకు చెప్పాలని చాలా ప్రయత్నించాను. కాని అవకాశం చిక్కలేదు. మీ మీద నేనేమైనా నిందలు వేస్తే అది కేవలం మానసిక వేదనతోనే.

చక్ర: మీ హృదయానికి బాధ కలిగిస్తే క్షమించండి. ఈ రెండు రోజుల్నించే మీరు చాలాకాలం ఈ హాస్పిటల్లో ఇక్కడే గడిపారని నర్సు చెప్పింది. మీది ఇంత దయార్ద్రహృదయమని నాకిదివరకు తెలియదు...ఒక విషయం అడుగుతాను— వంద సిల్కుచీరలూ వంద సిల్కు జాకెట్లూ సంపాదించారా?

విజయ: (కాసేపాగి) సంపాదించాను.

చక్ర: (విషాదంగా) రోజాలు అంత మంచివి కావు. అవి అపహరించటానికి వీల్లేని చోట దాచుకోండి...పోతే మళ్ళీ కొనటం కష్టం.

విజయ: అవి దాచినచోటు ఎవరూ కన్నెత్తి చూడలేనిది; చక్రధరరావుగారూ!

చక్ర: అంత పదిలమైన చోటు ఏమిటో......

విజయ: హృదయం.

చక్ర: హృదయమా?

విజయ: అవును.

చక్ర: (భావోద్రేకంతో) విజయా...

విజయ: ఏమిటి?

చక్ర: అమూల్యమైన ఆ హృదయం కోసం చెయ్యి చాపటానికి సాహసిస్తున్నాను. విజయా భిక్షాం దేహి...

విజయ: అనవసరంగా చెయ్యి చాపారు.

చక్ర: (దెబ్బతిని) క్షమించండి, చాలా ఘోరంగా పొరబడ్డాను.

విజయ: మీరు పొరబడలేదు.

చక్ర: ఏమిటి మీ అభిప్రాయం?

విజయ: అయాచితంగానే నా హృదయం మీ కర్పించాను.

చక్ర: (భావోద్రేకంతో) విజయా...



సినిమా:

# సినిమా తారల క్రికెట్ క్రీడ

గత నెల 14 వ తేదీన వాహినీ స్టూడియోలో జరిగిన సినిమా తారల సంక్రాంతి సంబరాల అనంతరం చెప్పుకోదగిన విశేషం మొన్న 27 వ తేదీన జరిగిన తారల క్రికెట్ క్రీడ. క్షయరోగ నివారణ నిధి కోసం ఈ క్రికెట్ ఆట మద్రాసు కార్పొరేషన్ స్టేడియంలో ఏర్పాటు చేయబడింది. వసుంధరాదేవి జట్టుకూ, సూర్యకుమారి జట్టుకూ పోటీ జరిగింది. మొదట కమలా కోట్నీస్ వస్తుందనుకున్నారు గాని ఆమె రానందున సూర్యకుమారి ఒక జట్టుకు నాయకత్వం వహించింది.

ఆటలో మద్రాసు చలన చిత్ర రంగానికి సంబంధించిన వాళ్లే కాక బొంబాయికి చెందిన రాజ్ కపూర్, కరణ్ దివాన్ లు కూడా పాల్గొన్నారు. క్రికెట్ అభిమానులు ఆట చూద్దామని కొనివ్వండి, తెరమీద రెండు "డైమన్షన్స్" లో కనిపించే తారలను మూడు "డైమన్షన్స్" లో చూద్దామనే కుతూహలంతో కొనివ్వండి, మొత్తానికి 15 వేల మంది వచ్చారు. వచ్చినందుకు ఆటలో పస ఏమీ లేక పోయినా, ఆటగాళ్లను, ఆటగత్తెలను చూసి వినోదించారు.

వసుంధరాదేవి జట్టువాళ్లు ఆట ప్రారంభించారు. వీరిలో వసుంధర (కెప్టెన్) డైరెక్టరు కెంపరాజ్, ఎన్. బాలచందర్, పులిమూటై, టి. ఆర్. రామచంద్రన్, శ్రీరాం, కుమారి కమల, రాజ్ కపూర్, గణేశన్, ఎన్. ఎస్. కృష్ణన్, టి. ఎ. మధురం, విశ్వనాధన్, కె. నాగేశ్వరరావు మనోహర్ ఉన్నారు. వీరిలో ఆట ఆడగలవాడు జెమినీ స్టూడియోలో పని చేస్తున్న గణేశన్ ఒక్కడే. ఇతడు 59 పరుగులు సంపాదించి ఔట్ కాకుండానే విశ్రాంతి తీసుకున్నాడు. బొంబాయి నటుడు, ప్రొడ్యూసరు రాజ్ కపూర్ ఒక బౌండరీ కొట్టి ఔట్ అయ్యాడు. ఇతడు బాటింగ్ కంటె బౌలింగ్, ఫీల్డింగ్ లలో ఎక్కువ నేర్పు చూపాడు. మధ్యాహ్నం 2-40 వరకూ ఆడి ఈ జట్టువారు 122 పరుగులు సంపాదించారు.

సూర్యకుమారి జట్టులో టి. ఎ. రామారావు, సహస్రనామం, సూర్యకుమారి (కెప్టెన్) ఎన్. టి. రామారావు, కాంచన, ఎస్. వి. రంగారావు, కృష్ణమూర్తి, కరణ్ దివాన్, టి. ఆర్. రజని, సి. హెచ్. నారాయణరావు, శివరావు, సారంగపాణి, టి. జి. కమలాదేవి, ముక్కామల కృష్ణమూర్తి ఆడారు. వీరిలో ఎక్కువ పరుగులు తీసింది అరవనటుడు సహస్రనామం (31) కాని ఆట బాగా చేతైనవాడు సి. హెచ్. నారాయణరావు. పది పరుగులు తీయటమే కాకుండా బౌలింగ్ చేసినప్పుడు నాలుగు వికెట్లు ధ్వంసం చేశాడు. సూర్యకుమారి ప్రత్యర్థి కెప్టెన్ వసుంధరాదేవి వలె ఒక పరుగుతోనే ఔటయినా ఫీల్డింగ్ లో కొంత శ్రమపడి బౌండరీకి పోయే బంతులు చాలా ఆపింది. ఈ జట్టు వాళ్లు సాయంకాలం 5 గంటల వరకూ ఆడి 93 పరుగులు తీశారు. (93-11)

ఆటగాళ్లలో హాస్యనటులు శివరావు, సారంగపాణి, పులిమూటై ప్రేక్షకులను బాగా వినోద పరిచారు. సారంగపాణి నాట్య సహితంగా బౌల్ చెయ్యటం, శివరావు ముందుకు బదులు వెనక్కి బౌల్ చెయ్యటం, పులిమూటై ఉసుగసురంటూ స్థూలకాయంతో 11 పరుగులు తీయటం ప్రేక్షకులలో నవ్వుల అలజడికి కారణమైంది. ఎన్. ఎస్. కృష్ణన్ రహస్యనుగూర్చి ఆలోచిస్తున్నాడో ఏమో మొదటినుంచి 'సీరియస్' గానే వున్నాడు. ఆడతారల మొగవేషాలు, వాళ్లు బౌలింగ్ చరిత్రలో ప్రవేశపెట్టిన కొత్త విధానం (నేలబారుగా, వికెట్ కి ఆమడ దూరం ఎడంగా బంతి విసరటం),

క్రికెట్ ఆట నియమాలను అంపైర్లతో సహా అందరూ భగ్నంచేసి వాటిమీద తమకు నమ్మకం లేదని నిరూపించటం, ప్రేక్షకులకు తమ డబ్బు వృధా కాలేదనే సంతృప్తినిచ్చాయి.

ఆటకు మద్రాసు గవర్నరు, మేయరు, మంత్రి గోపాలరెడ్డి, ప్రధాన న్యాయమూర్తి రాజమన్నార్ ఇతర పుర ప్రముఖులు హాజరయ్యారు. అందరికంటే ఎక్కువ పరుగులు తీసిన గణేశన్ కు ప్రత్యేక బహుమతి. మిగతా వారికి సామాన్య బహుమతులు ఇవ్వబడ్డాయి. ఆటగాళ్ళ తరఫున ఎస్. ఎస్. కృష్ణన్ ఉపన్యసించారు. ★



క్రికెట్‌లో పాల్గొన్న తారలు (పేర్లు వ్యాసంలో చూడండి)



వినోదావారి 'శాంతి' లో మాంధాతగారి పడుచుపెళ్లాం (సావిత్రి).

# ★ సినిమా వార్తలు ★

## పీపుల్స్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి 'పల్లెటూరు'



పీపుల్స్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారు పల్లెటూరి చిత్రానికి ఔట్ డోర్ షూటింగ్ కృష్ణా జిల్లా ఘంటసాల, కొడాలి ప్రాంతాలలో పూర్తి చేసుకుని వచ్చారు. వీరు మనోహరమైన కొన్ని పల్లె దృశ్యాలను చిత్రించినట్లు తెలుస్తున్నది. పల్లె పట్టులలో సంక్రాంతిపండుగలను వాస్తవికంగా చిత్రించారట. చెడుగుడి, ఎడ్ల పందాలు, తిరణాలు తీశారట. గడ్డిబళ్లలో ధాన్యపు మూటలు దాచి బ్లాక్ మార్కెట్ చేయడానికి తీసుకువెడుతుండగా అటకాయించడం వంటి ఘట్టాలు చాల శ్రద్ధతో తీసినట్లు తెలుస్తున్నది. ఈ చిత్రంలో వస్తాదులు సుబ్బులూ, ధనంజయుడు, నార్ల రామారావు మొదలైన వారు. ఇటువంటి సన్నివేశాలు, దృశ్యాలకు తోడు, ఆడంబరం లేని హృద్యమైన పల్లె గీతాలు రెండు రికార్డు చేశారు.

పొందిక ఉన్నా లేకపోయినా కేవలం వినోదం మాత్రం సమకూర్చడానికి తీసే నేటి చిత్ర నిర్మాతల పిరికితనం అనవసరమని ఈ చిత్రం నిరూపించ గలదు. సమాజ

యం. కె. యం. ప్రొడక్షన్స్ వారి మరదలు పెళ్లిలో బావ, మరదలు (ముక్కామల, కృష్ణకుమారి)



కరుణాకుమార్‌ని, సుభను, విరిచికట్టి నానా హింసలు పెడుతున్న దుష్ట చతుష్టయం, మాంధాత, మంజరి, టాంటాం, మేస్త్రీలు—వినోదావారి "శాంతి"లో.

ప్రయోజనంకోసం తీసే చిత్రాలనూ, నేటి సమాజ జీవనాన్ని వాస్తవికంగా ప్రతిబింబింప చేసే చిత్రాలనూ ప్రజలు తప్పక ఆదరించగలరనీ, సరుకు (లేక నాణ్యం అందాం) అట్టే ఉంటే మన ప్రజ చూడరేమో అనే భీతి నిరాధారమనే విశ్వాసంతో పీపుల్స్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారు ఈ చిత్రాన్ని కొత్త పంథాలో తయారు చేస్తున్నారు.

ఈ చిత్రానికి నాయికగా మొదట బుక్ అయిన జగదీశ్వరికి బదులు వీరు ఇప్పుడు సావిత్రిని బుక్ చేసుకున్నారు. సావిత్రి కాక ఇంకా టి. జి. కమలాదేవి, యన్.టి. రామారావు, యస్. వి. రంగారావు మొదలైన వారిందులో నటిస్తున్నారు. దర్శకుడు శ్రీ తాతినేని ప్రకాశరావు. కథకులు శ్రీ కుంకర సత్యనారాయణ, శ్రీ వాసిరెడ్డి భాస్కరరావు.

## ఫిబ్రవరిలో విడుదలౌతున్న తెలుగు చిత్రాలు

ఫిబ్రవరిలో నాలుగు తెలుగు చిత్రాలు విడుదలౌతున్నాయి. తొమ్మిదో తేదీని వినోదావారి 'శాంతి', ఇరవయ్యొకటో తేదీని విజయావారి 'పెళ్లి చేసిచూడు', మూడో వారంలో పద్మనాభన్ గారి 'రాజేశ్వరి', భారత లక్ష్మీవారి 'ప్రియురాలు' విడుదల కానున్నాయి.

వీనిలో 'రాజేశ్వరి' జానపద చిత్రం. మిగిలిన మూడూ సాంఘిక చిత్రాలు. విజయావారి 'పెళ్లి చేసి చూడు' హాస్యరస ప్రధానమైనది. పెళ్లికట్నాల వల్ల ఆడపిల్లలను కన్న వారి బాధలూ నేటి యువకులా పద్ధతిని నిరసించడమూ కథా వస్తువు. భారత లక్ష్మి వారి 'ప్రియురాలు' ప్రేమాదర్శాలను చిత్రిస్తుంది. ఈ చిత్రంలో మైసూరు బృందావన దృశ్యాలనూ మహాబలిపుర శిల్పాల దృశ్యాలనూ గోపీచంద్ గారు ఇరికించారు. వినోదావారి 'శాంతి'లో ధనవంతుల కుట్రలూ, కార్మికుల కష్టాలూ చిత్రించబడినాయి. పత్రికలను గురించిన వ్యాఖ్య కూడా ఈ చిత్రంలో ఉంది.

## విదేశాలలో భారత చిత్రాల ఖ్యాతి

రష్యా, జెకొస్లొవాకియా, హంగేరీలలో భారతీయ చలన చిత్రాలకు ప్రజల అపార ఆదరణ కలదని అంతర్జాతీయ చలన చిత్ర ప్రదర్శనానికి వచ్చిన ఆ మూడు దేశాల ప్రతినిధులూ బొంబాయిలో చెప్పారు. భారతీయ చిత్రాలు తరుచు ఆ దేశాలలో ప్రదర్శించబడుతూ ఉంటాయట. ఈ చిత్రాల ద్వారా భారతీయుల జీవన విధానాన్ని తెలుసుకోడానికి వారు తహ తహలాడుతూ ఉంటారట. అయితే ఈ నాటి

మన చలన చిత్రాలలో చిత్రణకూ కథలకూ వాస్తవ జీవితానికీ ఎక్కడా పోలిక లేదని వారికి తెలియడం లేదేమో. దీనినిబట్టయినా మన చలన చిత్ర నిర్మాతలు తమ బాధ్యతను గుర్తించడం అవసరం.

రష్యాలో ప్రదర్శనకు కావలసినన్ని భారత చిత్రాలు రావడం లేదని రష్యన్ ప్రతినిధి సెమెనోవ్ (సోవియట్ సినిమెటోగ్రఫీ డిప్యూటీ మంత్రి) అన్నాడు.

* * *

## యూరోపియన్ చిత్రాలలో అహింసా వాద ప్రచారం

యూరప్‌లో నేడు తయారౌతున్న చిత్రాలలో, ముఖ్యంగా ఇటలీ, ఫ్రాన్సు దేశాల చిత్రాలలో అహింసా వాద ప్రచారం అధికంగాకనపడుతోంది. రెండు ప్రపంచ యుద్ధాలను చవిచూసిన యూరప్‌లో అహింసా తత్వం తల చూపడంలో ఆశ్చర్యం లేదు. ఇంతే కాదు. కథా చిత్రణలో అపూర్వ నైపుణ్యం కనపడుతుంది. వీనితో పోల్చి చూసినట్లయితే హాలీవుడ్ చిత్రాలు తీసికట్టయి పోతాయి. మచ్చుకి మనకిప్పుడు అందుబాటులో ఉన్నవి. మూడు చిత్రాలున్నాయి. అవి ఫాబియోలా (*Fabiola*) (ఇటాలియన్), ఫర్‌బిడెన్ క్రైస్ట్ (*Forbidden Christ*) (ఇటాలియన్), లైఫ్ బిగిన్స్ టుమారో (*Life Begins Tomorrow*) (ఫ్రెంచి)

'ఫాబియోలా' పూర్వ రోమ్ నగర చరిత్రకు సంబంధించినది. క్రైస్తవ మతస్థులను సింహాల కెరచేసి, సిలువల కెక్కించి, మంటలలో సజీవంగా దగ్ధం చేస్తున్న కాలంలో క్రైస్తవులు పరమతస్థుల పైన పగతీర్చుకొనక అహింసా తత్వ మవలంబించి రోమ్ నగరవాసులందరినీ స్వమతానురక్తులను చేసిన ఘట్టాలు ఇందులో చిత్రించబడ్డాయి ద్వంద్వ యుద్ధంలో ప్రతి కక్షిని చంపకుండా ఓడించిన క్రైస్తవమత వీరుని పరమ విశ్వాసానికి ముగ్ధులై రోమ్ ప్రభుత్వ సైనికులందరూ అస్త్ర సన్యాసం చేసిన ఘట్టంతో చిత్రం ముగుస్తుంది.

ఫర్‌బిడెన్ క్రైస్ట్ అనే చిత్రంలో సోదరుని జర్మన్లకు ఒప్పగించిన ద్రోహిపై 'పగ తీర్చుకోవాలని శపథం పూనిన బ్రూనోను వారించడానికి యత్నించి, చివరికి బ్రూనో హింసా ప్రవృత్తికి తానే బలియైన మాస్టర్ ఆంటోనియో చరిత్ర చిత్రించబడింది.

మూడోది (ఫ్రెంచి చిత్రం) లైఫ్ బిగిన్స్ టుమారో యుద్ధ వ్యతిరేక చిత్రం. పారిస్ నగరాన్ని దర్శించి వచ్చిన ఒక వ్యక్తి నగరంలోని మేధావులు జీన్ పాల్ సార్త్రే, ఆంద్రీజీద్, పికాసోలనుకలుసుకొని నేటి యుద్ధభీతిని గురించి చర్చిస్తాడు. మానవకోటి నిమిత్తం అణు విచ్ఛేదన శక్తి (ఎటామిక్ ఎనర్జీ) ఎంతగా వినియోగ పడగలదో, ఏటం బాంబులవల్ల ప్రపంచానికెంత ముప్పు సంభవించగలదో ఈ చిత్రంలో వివరంగా చిత్రించబడిందట.



భారతలక్ష్మీ వారి 'ప్రియురాలు' లో జగ్గయ్య.

యూరప్‌లోనూ, తూర్పు ఆసియాలోనూ, పశ్చిమాసియాలోనూ ఆవరించిన యుద్ధ మేఘాలు మానవాళిని కలవరపరుస్తున్న ఈ సమయంలో ఇటువంటి చిత్రాలు ప్రజలనెంతైనా ఆకర్షించగలవు. మనదేశంలో ప్రయోజన రహితమైన మన చలన చిత్రాల సరళి ఎప్పుడు మారుతుందో తెలియదు.

బొంబాయిలో అంతర్జాతీయ చలన-చిత్ర ప్రదర్శనోత్సవ సందర్భంలో ప్రఖ్యాత ఆంగ్ల చిత్ర నిర్మాత ఫ్రాంక్ కాప్రా ప్రసంగిస్తూ, హాలీవుడ్ నిర్మాతలిప్పుడిప్పుడే చలన చిత్రాలలో కథావస్తు ప్రాధాన్యతను గ్రహిస్తున్నారని చెప్పాడు. సాంఘిక ప్రయోజనం గల చిత్రాలను ప్రజలాదరించరని మన చిత్ర నిర్మాతలు భావించడం పొరబాటు. వేలూ, లక్షలూ గుప్పి తెలిసిన కొద్ది మంది తారలకోసం ప్రాకులాడ్డంకంటె సరైనకథావస్తువు సేకరించడంలో మరింత శ్రద్ధ వహిస్తే ప్రజలు తప్పకుండా ఆదరించగలరని రుజువుకావడానికి ఆట్టే కాలం పట్టనవసరంలేదు. ★

# గ్రంథప్రాకారం

**పుష్పబాణ విలాసం:** — శృంగారరస ప్రధానమైన సంస్కృత శ్లోకములకు ఆంధ్రీకరణము; కర్త: శంకర ప్రసాద్; దొరకు చోటు: లలిత కళాసమితి, కాకరపర్రు, పశ్చిమ గోదావరిజిల్లా; వెల: 0-4-0.

**శాంతి కాముకు లెవరు?:**—కర్త: కె. సత్యనారాయణరెడ్డి; (1) శాంతి కాముకు లెవరు? (2) ఖూనీ కాదా? (3) ఎన్నాళ్లని (4) కథ అడ్డం తిరిగింది (5) రామ రాజ్యంలో, అనే అభ్యుదయ కథలసంపుటి; ప్రతులకు: ఫీనిక్స్ బుక్ హౌస్, ఏలూరు; వెల: 0-10-0

**ఉదయిని:**—అభ్యుదయపక్ష పత్రిక; సంపాదకుడు: తుమ్మల వెంకటరామయ్య; వెల 0-4-0; ప్రతులకు: 1, పోరూర్ సోమసుందర మొదలివీధి, టి. నగర్, మద్రాసు—17. విద్వాన్ విశ్వం, తాపీ, అనిసెట్టి, కొడవటిగంటి, గోఖలే మొదలగువారి రచనలుగల ఉదయిని ప్రథమ సంచిక జనవరి 1 న వెలువడింది.

**సందేశం:**—అభ్యుదయ మాస పత్రిక; సంపాదకుడు: పి. గోపాలరావు; వెల0-8-0 ప్రతులకు: 34, ఆచారప్పన్ వీధి, మద్రాసు—1.

**ఈడుజోడు:**—షేక్స్పియర్ నాటకాల కథలు; కర్త: బొడ్డుపల్లి పురుషోత్తం; వెల: 0-6-0; ప్రతులకు: శాంతి ప్రచురణలు, బాపట్ల, గుంటూరు జిల్లా. పిల్లలకు పఠన యోగ్యమైన పుస్తకం.

**వెలుగు నీడలు:-**

ఖండ కావ్యములు; కర్త: పోడూరి భోగరాజు; వెల 1-8-0; పట్టాభి రామా ప్రెస్, ఏలూరు.

**భిక్షావతి:-**

పద్యకావ్యము; కర్త: వజ్ఝల కాళిదాసు; వెల 1-8-0; దొరకు చోటు: వి. కాళిదాసు, 'ప్రవాసి' సంపాదకుడు, జంషెడ్ పూర్, బీహార్. ★



ఆర్. పద్మనాభన్ వారి 'రాజేశ్వరి' లో శ్రీరంజని, శ్రీరామమూర్తి.

# కర్తవ్యం

(6-వ పేజీ తరువాయి)

పెట్టడంతప్పితే వారి భావిసౌఖ్యాన్ని గురించి ఆలోచించడం కాని, జాగ్రత్త పడడం కాని యింకా నేర్చుకోలేదు. ఇప్పటికే దేశంలో జనాభా సమస్య చాలా విషమించింది. ప్రజలంతా తిండికి గుడ్డకూ మొహం వాచిపోతున్నారు. దీన్ని పరిష్కరించాలంటే, ప్రతి భర్తా, ప్రతి భార్యా ప్రయత్నించి తీరాలి. ఇది సులువుగా ఛేదింపబడే సమస్య కాదని నాకు తెలుసు. అయితే యీ విషయంలో ప్రభుత్వం కూడా కొంత సహాయం చేస్తుంది. అటువంటి ప్రభుత్వాన్ని నెలకొల్పడం మీ బాధ్యత.

"ఇంకో విషయం గుర్తుంచుకోవాలి. జనాభా పెరుగుదలను అరికట్టడంకంటె హిందూదేశంలోని ప్రజలను ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధులుగా, న్యాయశీలురుగా, ధైర్యవంతులుగా తయారుచెయ్యడమనేది ముఖ్యవిషయం. హిందూదేశం రోగగ్రస్తులూ, దారిద్ర్యపీడితులూ, ఉపేక్షాస్వభావులూ అయిన అమాయకులతో నిండివుంది. వీరందరిలోనూ చైతన్యాన్ని రేకెత్తించి వారిని ప్రగతిమార్గాన్ని పట్టించడం ముఖ్యం.

"అయితే దేశ సౌభాగ్యానికి జనాభా తగ్గింపు సర్వరోగనివారిణిలాగా పనిచేస్తుందంటేమాత్రం నే నంగీకరించను. జనాభా సమస్యను పరిష్కరించడం దేశ పునర్నిర్మాణంలో ఒక ముఖ్యభాగం మాత్రం కాగలదు. ఇదైనా ప్రజల్లో పూర్తి చైతన్యం కలుగుతేనే కాని సాధ్యమయ్యే విషయం కాదు. అటువంటి చైతన్యాన్ని ప్రజల్లో కల్గించడానికే మేము పూనుకుంటాము. అందుకని మీవోట్లు మాకిచ్చి మాకా అవకాశాన్ని కల్పించమని కోరుతున్నాను.

"మనదేశంలో జరిగే ఉత్పత్తి - ఉదాహరణకి తిండిగింజలు తీసుకుందాం - ప్రజలకు చాలినంతగా లేవు. జాతీయాదాయంకూడా ప్రతిదేశంకంటే, హిందూదేశంలోనే తక్కువ. మన దేశంలోని ప్రజలు దైనికావసరాలకు కూడా చాలీచాలని స్థితిలో జీవిస్తున్నారని ప్రతివారికీ తెలుసు. దీనికోరకు ఉత్పత్తి అయేదెంతో, ఖర్చయేదెంతో లెక్కలువేసి తేల్చుకోవలసిన పనిలేదు. ప్రజలు లేమిలో జీవిస్తున్నారన్న విషయం అందరికీ తెలిసినదే—కళ్ళకు కనబడుతున్నదే.

"ఒకవైపునుండి జనాభాతగ్గుదలకు కృషి చేస్తూన్నా, జాతీయాదాయాన్ని కూడా మనకు సరిపోయేటట్లుగా వృద్ధిచేసుకోవాలి. అందుకు తగిన సాధనాలను సంపాదించుకోవాలి. ఈ పనిచేయడానికి తగిన వారిని ఎన్నుకొని అధికారంవారిచేతుల్లో పెట్టాలి. అంతేకాని దేశం ఏమయిపోతూందో, తెలుసుకోకుండా పిల్లల్ని కనడంలో మాత్రం శ్రద్ధవహించకుండా జనాభాను పెంచుతూవుంటే దేశంలో ప్రతి వస్తువుకూ కొరత హెచ్చుతూనే వుంటుంది.

"జనాభా సమస్య కొంతమంది అనుకుంటూన్నంత సులువుగా పరిష్కరింపబడేది కాదు. కాని యీ సమస్యను పరిష్కరించడం మాత్రం దేశానికి చాలా అవసరం. దేశంలో కరువూ దారిద్ర్యమూ లేకుండా చెయ్యాలంటే, అది ప్రభుత్వం తల్చుకుంటే జరిగేపనికాని ఎవరో ఒకరు తల్చుకుంటే జరిగేపనికాదు. కనుక యీ విషయాన్ని సమగ్రంగా జాగ్రత్తగా ప్రతివొక్కవ్యక్తీ పరిశీలించి యీ విషయంలో ఎవరు మీకు నిజమయిన సహాయం చేయగలరని నమ్ముతారో వారికి మాత్రమే మీ వోటు నిమ్మనికోరుతున్నాను."

ఉపన్యాసం అంతా అయినతరువాత అతను ప్రజలకు మేలుచేసే ఉద్దేశ్యంతో శాసనసభా సభ్యత్వానికి ఆ నియోజకవర్గం నుండి పోటీచేస్తూన్నట్లూ ఫలానా గుర్తుగల పెట్టెలో వోటువేస్తే తనకు చేరుతుందనీ చమత్కారంగా చెప్పి సభ చాలించి, వేదిక దిగిపోయాడు.

ఇంతవరకూ విన్న గోపాలానికి నెత్తిమీది కొండను క్రిందికి దింపినట్లు అయింది. నిజంగా అటువంటి ప్రభుత్వమే వస్తే తనలాంటి వాళ్లు ఎంతమంది సుఖిస్తారో! గోపాలానికి తన జీవితసమస్యలు పరిష్కరింపబడే మార్గం దొరికింది. ఎన్నికల్లో తనవోటును ఎవరికి యివ్వాలో అక్కడే నిశ్చయించుకొని తేలికపడ్డ మనస్సుతో యింటిదారి పట్టేడు. 

# మేనరికం

(13-వ పేజీ తరువాయి)

ద్రమ్మ, శిధరుగుమీద వున్న రామయ్య కూడా, ఉలిక్కిపడ్డారు. వెంకమ్మ ముక్కు మీద వేలేసుకొంది, ఆశ్చర్యంగా."

"ఏం, ఏమంటారు, ఏమే అమ్మా ఏమంటావు, ఏమండీ మీరూ, ఏమిరా తమ్ముడూ చెప్పండి" అని తొందర పెట్టింది అందర్నీ.

"బాగుందక్కయ్యా తలవగానే తాతకి పెళ్ళా? తీరా, వాళ్ళేమనుకుంటారు, మేమేదో, స్వలాభంకోసం, సంబంధం పాడుచేసేమనుకోరూ"

సుందరంపంతులు, మీసాలు మెలివేస్తూ ఆలోచిస్తున్నాడు. రత్నమ్మ, కొడుకుని, మొగుణ్ణి, తమ్ముడిని, తల్లిని, లోపలికి పిలుచుకెళ్లి అరగంటసేపు ఏదో మాట్లాడుతూ కూర్చున్నారు. పైన, పెళ్ళికి వచ్చిన బంధువులు వెన్నెల్లో, కూచుని, కాఫీలు తాగుతున్నారు, ఆకలి చల్లార్చుకోడానికి వంట అయేలోగ.

రత్నమ్మ మొగుడికి ఈ ఆలోచన బాగా నచ్చింది. కృష్ణమూర్తి కూడా "ఊ" అన్నాడు. కాని, రామయ్య, తల్లీ, సంశయాలు పడ్డారు. ఎందుకు పడ్డారో, వాళ్ళకే తెలియదు."

"బాగుంది, మీ ఆలోచనలూ మీరూను. శాల్తీని ఏడవరు మీమీద. వాళ్లకీ, మాకూ కూడా యిష్టం లేక పోయాయి గాని, మధ్యని మీకేం చేశారని"

"అవును. బావగారూ నేను యింకో వారంరోజులు శలవు పెట్టి యిక్కడే వుంటాను. ఈలోగా మరో ముహూర్తం పెట్టిద్దాము."

"ఈ క్షణంలో ఎలా తయారవుతాయి. రత్నమ్మా నీపిచ్చిగాని ఏమీ సిద్ధంగానైనా లేము. వారం రోజుల్లో అయితే మాత్రం అంది వెంకమ్మ

"ఏమీ అవక్కరలేదు, మనలో మన కేమిటి, అన్నీ సర్దుకుందాం అమ్మా, ఏంరా తమ్ముడూ" సరే రాధమ్మని కూడా అడుగుదాం పదండి, అన్నాడు రామయ్య.

బాగుంది ఎద్దునడిగి గంతలు కడతాట్రా, ఆకేం పట్నవాసపు పిల్లకనకనా, అవునూ కాదూ అని చెప్పడానికి? అదే గంతేస్తుంది, ఈ మాట వింటే" అని రత్నమ్మ గర్వంగా అంది.

"అవునులే, కాని ఇది సవ్యంగా నడవలేదు కదూ? కాబట్టి ఈ అపసవ్యంలో ఒకసారి అడుగుతే మంచిది అని."

"సరలే పద మాకేం మేం వస్తాం" అంటూ రత్నమ్మ, అందరూ బయలుదేరేరు రామయ్య యింటికి.

ఈ అలజడి ఈ పెళ్లి విఘాతం తెలుసుకుంటూ పడుకొన్న రాధని తండ్రి లేపడం చూసి ఆశ్చర్యం వేసింది. బావని, అత్తని చూడగానే ఆ నిద్రకళ్లతో ఏం అర్థం అయిందికాదు.

"రాధా, యిలారా ఒకసారి"

రాధ మాట్లాడకుండా తండ్రితో లోపలికి వెళ్లింది. రామయ్యతోబాటు రత్నమ్మ వగైరాలు కూడా లోపలికి వెళ్లేరు.

"బావ నిన్ను పెళ్లి చేసుకుంటాడుటమ్మా"

రాధకి తుపాకీ పేల్చినట్టయింది. తన బావ ఇలా మారుతాడు అని ఎలా అనుకుంటుంది? ఎన్నో తనని అక్కరలేదని అసహ్యించుకొని తిట్టినవాడు? అలా ఆలోచిస్తూ శూన్యంగా గోడవేపుకి తల తిప్పింది రమణయ్య చిన్నబుచ్చుకున్న మొహంతో అటువేపు వచ్చి వెళ్లిపోవడం మసకగా కనిపించింది.

"అది మా చక్కా చేసుకుంటుందిరా, మౌనంఅర్ధాంగీకార సూచకం. పదపోదాం" అంటూ రత్నమ్మ బయటికి దారి తీసింది.

రాధ ఒక్కసారి ఆశ్చర్యపడిపోయింది. చాటుగా తండ్రిని పిలిచి ఏదో చెప్పింది చెవిలో. రామయ్య తెల్లపోయాడు. అయిదు నిమిషాలు తరవాత తెప్పరిల్లి "మరి నాకెందుకు చెప్పలేదు యిది వరకే?"

"నాకేం తెలుసు నాన్నా, యిలా అవుతుందని. యింకా ఎప్పుడో అన్నీ అయాక చెప్పుదామని"

"ఏమయినాక?"

"బావ పెళ్లి అయేక"

"మరి అయితే తప్పదన్న మాట"

"ఏం మీ కిష్టం లేదా?"

"ఏదయినా నీ యిష్టమే నమ్మా నా యిష్టం. వుండు వాళ్లతో చెపతానని వీధి వసారాలోకి వెళ్లేడు రామయ్య. అంతట్లోకి అవతల ఆడ పెళ్లివారు ఏవో ఆలోచించుకొని సుందరంపంతుల్ని బతిమాలడానికి వచ్చారు. సుందరం పంతులు ససేమిరా, అంటున్నాడు.

"ఇదిగో, పంతులుగారూ యివి మా కాళ్లు కాదు చేతులు. మీరు చేసుకోకపోతే యిక మా అమ్మాయికి పెళ్ళెలా అవుతుంది? ఏదో బుద్ధి లేని సీనయ్యమాటలకేం, ఎలాగో మందూమాకూ యిప్పించుకుందాం యిప్పటికి ఆరు నెలలనించే పిల్ల యిలా అవుతూంది. అక్కడికీ రెండు వేలు ఖర్చు పెట్టేము. మరేం ప్రమాదం లేదని చెప్పేరు డాక్టరు" అని పెళ్లి కూతురుతండ్రి సుక్క తిప్పకుండా బతిమాలడం మొదలు పెట్టాడు.

"మరి పెళ్లిపందిట్లోనే వాడికి బుద్ధి చెప్ప లేకపోయారూ. చేస్తానన్నాడు కదూ యింకో సంబంధం చేసుకోండి. మాకేం అవసరం లేదు మీ పిల్ల."

"ఏమిటో మతిపోయి నట్టయిపోయింది బావగారూ యింతసేపూ మేము ఎలాగ మీ దగ్గరకి రావడమా అని ఆలోచనలో పడిపోయాం. మీదే భారం.

"మాకేం అవసరం లేదని చెప్పటం లేదూ. వెళ్లండి పెళ్లి ముందరే ఇంత చేసినవాళ్లు పెళ్ళయినతరువాత ఎంత చేస్తారో? ఆ రోగపు పిల్ల మాకేం అక్కర్లేదు" అని రత్నమ్మ, మొగుడు ఖచ్చితంగా చెప్పేశారు. లోపల నుంచి వచ్చిన రామయ్య రత్నమ్మని బావని పిలిచి ఏదో మాట్లాడాడు. రత్నమ్మ అరికాలి కోపం తలకెక్కిపోయింది. కృష్ణుడి మొహం పాలిపోయింది అవమానంతో. రత్నమ్మ తమ్ముడివేపు చూస్తూ శాపనార్థాలు పెట్టడం మొదలు పెట్టింది.

"మీరందరూ గంగలో కలిసిపొండి, నన్ను అవమానం చెయ్యడానికే మీరింతా చేసేరు, పోతారులెండి .."

"ఊరుకో, ఊరుకో ఇలారా" అని మళ్లీ సుందరం పంతులు ఏదో రత్నమ్మతోను, కృష్ణుడితోను చెప్పేడు. వాళ్ల కిష్టం లేకపోయినా మింగలేని కక్కలేని లా అయింది.

"అనుభవించండి తెచ్చి పెట్టుకున్నందుకు ఆ యిచ్చిన కట్నంతో రోగం కుదుర్చుకోవాలి. ఏదో మర్యాదగా యింటికి పోవాలి" అని అంటూ సుందరం పంతులు పయికి వచ్చి,

"సరే, ఏదో మీరింత బతిమాలుతున్నారు కాబట్టి ఒప్పుకుంటున్నాం" అన్నాడు పెళ్లివారితోటి ఆదో విధంగా మొహం పెట్టి.

"అలా అనేస్తే నేనేం చెప్పతాను. మీరు మరే విధంగా మనస్సులో భావించ కుండా ఏదో వున్న పక్క పిల్లని కడుపులో పెట్టుకోవాలి. మీ కూతురే అనుకొని. ఆ ఒక్క మాట వదినగారినోటంటా కూడా వింటే, మీకు యింకేం కోపం లేదని నిర్ధారణ అయితే సంతోషిస్తాను" అని పెళ్లికూతురు తండ్రి కొంచెం సంతోషంగా మొహం పెట్టి అన్నాడు రత్నమ్మ వేపు ప్రశ్నార్థకంగా చూస్తూ. "ఆ మీరు నక్కని తొక్కొచ్చేరు. నాకేం సంబంధం లేదు. మీరూ ఆయన వాడు యిష్టపడితే నేనెవ్వర్తిని మధ్యన నాకేం చెప్పకండి" అంది. కృష్ణమూర్తిమనస్సు మనస్సులో లేదు. రాధ నిజంగా దెబ్బకి దెబ్బ తీసింది తన కొకగుణ పాఠం నేర్పింది అనుకున్నాడు. తను అనాయకంగా రాధని తూలనాడ్డంవల్లే ఈ క్షణంలో తనకిష్టం లేని పిల్లని పెళ్లి చేసుకోవలసివచ్చింది ప్రపంచానికి దడిసి.

వెంకమ్మగారు. 'కల సులభం అని గుడ్డి దాన్ని పెళ్లాడితే సెలకి మూడు వాల కుండలు బద్దలకొట్టేదట' అని నవ్వుతూ కృష్ణమూర్తి వేపు చూసి. అక్కడ వున్న సుందరం పంతుల తాలూకు బంధువులకి ఏమీ అర్థం కావటం లేదు. నిజంగా రత్నమ్మకి ఆయనకి గూడా పిచ్చిపట్టిందేమోనని అనుకున్నారు లేకపోతే ఎవరి సలహా లేకుండానే ఘడియకి రాధ, మరో ఘంటకి మళ్లీ లక్ష్మిని నిశ్చయిస్తున్నారు వాళ్లలో వాళ్లే!

చూడ్డానికి వచ్చిన మంగమ్మ రమణయ్య అలాగే నిల్చున్నారు చూస్తూ అర్థం కాక. రమణయ్య మనస్సులో మనస్సు లేదు. కాని మళ్లీ సుందరంపంతులు పెళ్లివారితో నవ్వుతూ బాతాఖాని కొడుతూండడం చూసి మళ్లీ తనలో తానే తమాయించుకున్నాడు. రాధని కృష్ణమూర్తి చేసుకోవటం లేదేమో అని.

"ఏంరా, రమణయ్యా రాధనిన్నే పెళ్లాడుతుందిట్రా, అల్లుడివి అవుతావు యికమీదట. బావని చేసుకోనని చెప్పింది" అన్నాడు రామయ్య నవ్వుతూ. అక్కడున్న వాళ్లలో కొందరు మాత్రం యిదా సంగతి అనుకున్నారు ఆశ్చర్యంగా. రత్నమ్మ కృష్ణమూర్తి మాత్రం వాళ్లకా మాటలు లక్ష్యంలేనట్టు వినివూరుకున్నారు. మనస్సులో మండుతూన్న అవమానం పయికి కప్పిపుచ్చడం కోసం రమణయ్య, మంగమ్మ కూడా అలాగే ఆశ్చర్యపోతూ నిల్చున్నారుయీమాటలు నమ్మలేక పోతూ.

"నిజంగా!" అన్నాడు, కొంతసేపటికి తెలివి తెచ్చుకున్నాక, అప్రయత్నంగా. 'రాధ తననే కావాలిందా, బావ చేసుకుంటానన్నాకగూడా! అన్న ఆశ్చర్యంతో,"

"నిజమేరా, అదుగో, ఆ చిన్నకొట్లో వుంది కావలిస్తే అడుగు?"

రమణయ్య, ప్రశ్నార్థకంగా అటువేపు చూసేసు కిటికీలోంచి, రాధ చిలిపిగా, "అవును" అన్నట్టు తనకేపు చూసి నవ్విన నవ్వు, ఆ గుడ్డి కన్నా అందంగా కనిపించింది రమణయ్యకి!" ★



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras



'బాణాసంచా'—షాజహాన్ చక్రవర్తి స్వంత చిత్రాలనుండి సేకరించినది.
హైదరాబాద్ సాలార్ జంగ్ చిత్రవస్తు ప్రదర్శనాలయంలోని పురాతన వర్ణచిత్రాలలో ఇదొకటి.

స్వార్థం జృంభించి, పేదగొప్పల
వ్యత్యాసాలతో కుళ్ళిపోయిన
నేటి ప్రపంచానికి
సర్వమానవ సమానత్వం
చాటు

వినోదా వారి

# శాంతి

చంద్రకుమారి.. సావిత్రి... సి.హేమలత
డా. గోవిందరాజుల సుబ్బారావు...రామచంద్ర కాశ్యప
ఆరణి... పేకేటి శివరాం

కథ కొవ్వలి • పాటలు సముద్రాల (జూ.) • సంగీతం సుబ్బరామన్ • ఛాయ బి.యస్. రంగా • కళ

దర్శకత్వం.. వేదాంతం రాఘవయ్య



నిర్మాతలు
వినోదా పిక్చర్స్
మద్రాసు.17

పూర్ణా రిలీజ్